# అమరుక కావ్యము

అమరుక కవి సంస్కృత కృతికి
ఆంధ్ర పద్యానువాదము

కావ్యతీర్థ, కవిశావతంస
శ్రీ గట్టి లక్ష్మీ నరసింహ శాస్త్రి

సాహితీ సమితి
. తెనాలి .

మిత్రుడు

మల్లాది దుర్గాప్రసాద్‌కు

అంకితము

# కృతి సమర్పణము

అమృతమయమ్ము కావ్యమిది, యయ్యది యే రుచివొందువిందుగా
సమరి, యమోఘధీమహితు లౌ సుమనస్సులకున్ నిషేవ్య; మో
యమృతమయూఖసన్నిభమహాయశ: నీయెసలారు పేర్మి నీ
యమరిక నంకితం బయిన దన్న, రసాఢ్యము కాక యన్నె మే?

నాయకు లన్న ముత్తెముల నాణెపుజాలునఁ జేర్చి, నాయికా
ఖ్యాయికవృత్తిసూచికల యచ్చపు మేలిగొనమ్ము లెచ్చఁగా,
నాయతిఁ గూర్పఁగాఁబడినయట్టిది గట్టినిబంధ మిద్ది, యా
చాయల ఛాయలం గనఁగఁ జాలిన దీలలి, మేలు; మిత్రమా!

యమికులసార్వభౌముఁ డమరావనినాథుని మేనఁ జొచ్చి, తాఁ
దమి మెయి, శంకరుం డగుచు, దర్పకదర్పకలావిలాసముం
గ్రమమున నభ్యసించి, తగుకాలమునన్ రచియించినట్టి కా
వ్యమ యిది యంద్రము కొంద; అది వట్టిది వట్టిది వట్టిదే సుమా!

*

# ప్రస్తావన

౧

అమరుకశతకము జగత్ప్రసిద్ధము. మండనమిశ్రుని భార్య శారదా దేవి కామకలను గూర్చి ప్రశ్నించినపిమ్మట, శ్రీ శంకరభగవత్పాదులు, మరణించిన అమరుకమహీపాలుని కళేబరమున ప్రవేశించి, సమస్తభోగములు భోగించి, అనుభవరసికుడై అమరుశతకమును రచించె నని ప్రవాదము కలదు. ఇది ఏ విధమున నూహించినను తుచ్ఛము. అమరుకాఖ్యు డగు మహారాజు పేరు రాజవంశావళులలో కానరాదు. సర్వజ్ఞు డగు శ్రీ విద్యాశంకరులు కామకలను గ్రహించుటకై పరకాయప్రవేశము చేయనక్కరలేదు. అట్టి హేయకార్యము సంభవింపను లేదు.

> "కవి రమరః, కవి రమరః, కవి రభినందశ్చ కాలిదాసశ్చ,
> అన్యే కవయః కపయః, చాపలమాత్రం పరం దధతే."

అని ఒకానొక రసికుడు చేసిన ప్రశంసలో, అమరుకాఖ్యుడగు కవి, ఉన్నట్లు స్పష్టమగుచున్నది. ఈతడు ఏప్రాంతమువాడో, ఎన్నడు వర్ధిల్లెనో, చెప్పుట సాధ్యము కాదు. కాని, ధ్వన్యాలోకమున, తృతీయోద్ద్యోతమందు–

> "ముక్తకేషు హి ప్రబంధేష్వివ, రసబంధాభినివేశినః కవయో దృశ్యన్తే. తథా హ్యమరుకస్య కవే ర్ముక్తకాః శృంగారరస స్యందినః ప్రబంధాయమానాః ప్రసిద్ధా ఏవ."

అని ఆనందవర్ధనాచార్యుడు పలికినాడు. కావున, క్రీ. శ. నవమ శతాబ్దికి పూర్వము అమరుకు డుండె నని సుస్పష్టము.

వామనాచార్యుని కావ్యాలంకార సూత్రవృత్తిలో – "గ్రామేఽస్మిన్ పథికాయ . . ." అను అమరుకశ్లోకము నుదహరించుటచే, ఏతత్కవి క్రీ. శ. అష్టమశతాబ్దికి పూర్వు డని ఊహింపవచ్చును. పురాతత్త్వవేత్తలు కొందఱు క్రీ. శ. ఏడవశతాబ్దిలోనే అమరుకు డుండె నని భావించినారు.

సర్గబంధమునకు గల ప్రతిష్ఠ పద్యసందోహముల కుండదు. కాని, “అమరుకకవే రేకః శ్లోకః ప్రబంధ శతాయతే” అను ఆభాణకము జగద్విదితము. అమరుశతకములో పద్యములు ముక్తకములు. ముక్తకము అన్నప్పుడు ఒకపద్యమునకు మఱొకపద్యముతో సంబంధము ఉండదు. గ్రంథ మంతయు ఇంచుమించుగా అట్లే యున్నను, ౪౧, ౪౨; ౬౪, ౬౬; పద్యములుమాత్రము యుగ్మకములుగా కానవచ్చుచున్నవి. కథాసూత్ర మేమియు లేకున్నను, అమృతఘుటికాప్రాయములు, శృంగారరసమయములు, అగు వీతన్ముక్తకసముచ్చయములకు గల స్వారస్యము, అన్యత్ర అగపడదు.

ఇందలి భావములు, రసములు, హృదయంగమము లగుటయే గాక, రచనయు రమణీయము. ఈకవి దశవిధకవులలో శిల్పి కూడ నగును. పరిశోధకులు, అమరుకుడు స్వర్ణకారు డని నిర్ధారణ చేసినారు. కావుననే ఇందలి వర్ణనములో సువర్ణత్వమే కాక, విశిష్టశిల్పము కూడ విస్పష్టముగా పొసగినది.

శార్దూలవిక్రీడితమును రాజశేఖరుడు బాగుగా నడపినా డని ప్రతీతి. అమరుశతకములోని శార్దూలములు, ప్రసన్నగంభీరములుగ నడచినవి. విశేషభాగము, శార్దూలములనే నడపినను, హరిణీవృత్తముకూడ, ఈతనికి సరసముగ స్వాధీన మయినది. ప్రసిద్ధవృత్తము లనేకములు అమరుకమున ఆయాస్థానము లందు కర్ణరసాయనములుగా పొందుపరుపబడినవి. కథాసూత్రము లేకున్నను అమరుశతకమునకు మహాకావ్యత్వము నంగీకరింపవచ్చును.

౨

రమణీయమైన ఇట్టిశతకమును శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి రసబంధురముగా నాంధ్రీకరించినాడు. ఈయన, మహోపాధ్యాయులయొద్ద సంప్రదాయానుసారముగా సంస్కృతాంధ్రములలో నిశితపాండిత్యము సంపాదించి, సహజ కవితానైపుణితో బహుగ్రంథములను సంస్కృతమునుండి ఆంధ్రీకరించియున్నాడు. ఇంతకుపూర్వము, అమరుశతకమును అనేకులు తెలిగించియున్నారు. ఐనను, ఈ అనువాదమందు విశిష్టత కలదు. మాతృకలోని రసభావము లేమాత్రము చెదరక, కొన్నియెడల పరిపుష్టములై ప్రసిద్ధాంధ్రవృత్తసరణిలో, సహృదయామోదకములుగా జాలువాఱినవి.

అమరుశతకములో, నూరు శ్లోకములే కలవు. కాని, కొన్ని ప్రతులలో అధికశ్లోకము లుండుటచేతను, సుభాషితావళిలో నూతనశ్లోకములు మఱికొన్ని లభించుటచేతను, సూక్తిముక్తావలి, శార్ఙ్గధరపద్ధతులలోను, ఔచిత్యవిచార చర్చలోను, మఱికొన్ని శ్లోకములు లభ్యమగుటవలనను, దీనిని శతకము అనుటకన్న, కావ్యము అనుటయే సరస మని, అనువాదకుడు, భావించి, అమరుకకావ్యము అని తన అనువాదమునకు పేరిడినాడు.

ఈ యనువాదము, సహృదయసమ్మత మగు నని నా విశ్వాసము.

శివ శంకర శాస్త్రి
(సాహితీ సమితి సభాపతి)

సాహితీ సమితి
30. 10. 1951

# అమరుక కావ్యము

జయతు జగద్విజయ నిజ
ప్రియసాయక శాణనస్ఫురిత మేచకతో
దయ నవమృగమదపత్రక
మయ రతిమదవత్యూలోజమండల మతులమ్.

* * *

ఘనగుణాకృష్టిబద్ధ ఖటకాముఖహస్త నట న్నఖాగ్రరు
ఙ్మనితగుణమ్ము, మంజరిత మంజుల పల్లవకర్ణపూర లో
భన విధుర భ్రమ ద్భ్రమరవల్లభ విభ్రమభృ న్మనోజ్ఞ, మై
యను వగు సర్వమంగళదయామయవీక్షణమోముత౯ మిముక౯.

ఉడుగని యుడుకున నుత్క్షిప్త మయ్యును,
దలిరాకుచేతులఁ దవులుకొనుచు;
న ట్టిట్టు నభిహత మయ్యును, బలిమిమైఁ
జేలాంచలమ్ములఁ గీలుకొనుచు;
నెఱి నపాస్తమ యయ్యు, నిడుద పెన్నెఱివేణు
లార్ద్రాపరాధియ, ట్లంటుకొనుచు;
ననవేక్షితమ యయ్యు, నడుగు కెందామర
దోయిపై వ్రాలి, వే ద్రోవఁబడుచు;

లలి, సముద్గీర్ణబాష్ప ఝల జ్ఝలాయి
త నయనాబ్జలౌ త్రిపురశుద్ధాంతకాంత
లం గవుంగిటఁ గొన్న కడంగరీయ
హాయునిశరవహ్ని మీయఘు మడఁచి తుడుచు. ౨

ఏలా శ్రీశ గిరీశ ధాతృముఖు లిం? కెవ్వేల మి మ్మేలు లీ
లాలోలోల్లులితాలకమ్ము, పరినృత్యత్కుండల, మ్మాత్మభూ
కేలివ్యత్యయతాంతముఁ, మధుర, ముద్గీర్ణశ్రమాంభఃపృష
త్పాలీమృష్టవిశేషకమ్ము, ప్రియకాంతాకాంతనేత్ర మ్మొగిన్. ౩

అలవారునలసత నావలితమ్ములు,
వల నొప్పు వలపులమొలపు లన్న
తీఁపితేనెలఁ దేఁపతేఁపకు నార్ద్రార్ద్ర
ములు, ముకులీకృతములును సారె,
నొకచెప్పపాటున కొప్పునంతల యభి
ముఖములు, మునుకొని మొనయులజ్జ
నాలోలతమములు, నయి, మూఁతలకుఁ బరా
ఙ్ముఖములు, రసపూరపూరితములు,

హృదయనిహితభావాకూత మదను దెలిసి
వెలికిఁ బ్రకటించుచున్నటుల్ వెలయువాలు
చూపుకోఁపుల నిటు చూచుచుంటి, వెడఁద
పొంగ, నేపుణ్యపురుషునో! ముద్దరాల! ర

కొనగోళ్ళన్ సవరించుకొం చురలునెక్కొల్గొన్న కన్నీరు, కో
పన! నేఁడేల వగర్తు వ్రూర కిటు? లేద్వ్యంగావలెన్ ఫూత్కృతుల్
మొనయం, ద్వత్పిశునోపదేశవచనస్ఫూర్తిన్ సునిర్విణ్ణుఁడై
యనుఁగుంజెల్వుఁ డనుప్రసాదమునమాధ్యస్థ్యమ్ముఁదాఁబూనినన్.

కొలిపితి వీవె ప్రేమ, సుమకోమలికిం; జిరలాలనమ్మునన్
నిలిపితి వీవె; నిర్ఘృణుఁడ! నేఁ డిటు దుర్విధిచే నలీకముం
జలిపితి వీవె; చాటువుల సైఁపఁగ రాని యమర్ష మారునే?
నలి నిఁక ముక్తకంఠకరుణమ్ముగ నేడుచుఁగాక నాతి తాన్. ౬

ప్రణయినీ! వెలుపలిద్వారమ్ము చెంతన
    నేల వ్రాయుచు నునుగాలి వ్రేలఁ,
ప్రాణవల్లభుఁ డదె వదనమ్ము నిల వంచి,
    నిలబడియున్నాఁడు నీదయకయి;
యుడుగనివగలసముచ్ఛూననయనలు
    నెచ్చెలుల్ కూడును నీ రెఱుఁగరు;
చదువుసంతలుఁ బొంటిసంతసమ్మును మాని,
    వనరెడుఁ జిలుకలు పంజరములఁ;

దరుణి! రుద్ధబాష్పాంబక ధ్మాయమాన
తత నిరంతరశ్వాస కదర్థ్యమాన
మానితాధరస్ఫురణాది మన్యమాన
మానకల లంచుకించుక మాన వింక. ౭

పొలఁతుక! వింటివే? పొలఁతులు వెలికి నే
సుద్దియు నెఱుఁగని ముద్దరాండ్రు;
లోలో శరల్; వార లోలిఁ జెల్వ్వ హరింత్రు;
వారిత లయ్యుఁ దా రోర్వరు నిలువఁ;
దోశానువేదన దోదూయమానమా
మానసమ్మున స్రుగ్గి మ్రగ్గ మేలె;
ఏల యీలాలి విలపింతు వ్వూరక? పొసఁ
గింపఁబోకుము వారికిం బ్రియంబు;

కాంత! కాంతుఁ డాతఁడు నడికారువాఁడు,
మేలిరూపసంపదవాఁడు, కేలిరతుఁడు;
వశమునం గొని కర్కశ బర్బర ప్రి
యప్రకరములచే విక్రయమునఁ బడఁడె? ౮

వలితాలోలమనోజ్ఞబాహులతికాపాశంబునందున్ వయ
స్యలమ్రోలం గొని, చేర్చి సంజతటినిన్ సంకేతమున్, దోసముల్
వెలికిం జాటుచు నేడ్చునన్గఁజెలిచే, లేనవ్వుతో, వెండి పా
టిలనిల్లంచును, దాడితుండుమగవాఁడే ధన్యుఁడున్ మాన్యుఁడున్.

మరలన్ రారొ ప్రవాసమేగియుఁ బ్రియుల్? మానింపరో పొందు? వం
దురి యీరీతిఁ గృశింపఁబోకు మని, యేనుం గంట నీ ర్వెట్ట, నే
డ్తెర, వ్రీడాజడతారకమ్ము నిపతత్పీతాశ్రుక మ్మైన దృ
క్సరణిన్ నన్గని, తెల్పె, భావిమృతి, నాశ్యామాంగి యున్నవ్వుతోన్

నెలఁతా! వంచితిఁ దన్ముఖాభిముఖమౌ నెమ్మోముఁ; జూపం ఘ్రుల్లన్
వెలయం జేసితిఁ; దద్వచోరతములౌ వీనుల్ వడిన్ మూసితిన్;
పులకల్ నిండిన చెక్కుటద్దములపైఁ బోఁ దుడ్చితిం జెమ్మటల్;
సలుపన్ నేర్తునిఁకేమి? వే పగిలి ప్రీలన్ సాఁగెఁ జోల మ్మిటుల్.

క్రమ్మరివత్తువా ప్రహరకాలమునన్? నడిజామునన్? బరా
హ్ణమ్ముననే? దినాంతసమయమ్మున? నంచు, రచించె నంతరా
యమ్మును గొమ్మ, వాసరశతాప్య విదేశము పోవ నున్న నె
య్యమ్ములప్రాణవల్లభున, కశ్రుజలమ్ములఁ దోఁగుపల్కులన్.

అద్దమరేయి భీమభయదాంబుదగర్జల నాలకించి, తాఁ
దద్ద కలంగి, యూర్చుచు, నెదం దలపోసి యనుంగుముద్దియం,
బెద్దగఁ గంఠ మెత్తి, విలపించెను పాంథుఁడు వేఁగుదాఁక; నా
ప్రొద్దున వానినిన్ వెడలద్రొబ్బిరి గ్రామమునుండి, తత్ప్రజల్.

అతిదూరమ్మననుండియే సలిపినా వభ్యుద్గమం; బానతిన్
నతశీర్షంబునఁ దాల్చినావు; లవమున్ శైథిల్యమే కానరా
దతివా! సస్మితదృష్టిమేలనమునం; దంతర్నిగూఢక్రుధా
తతపాషాణమనస్కా! నీ తెఱఁగు సంతాపంబుఁ గూర్చెం గడున్.

పొలయల్కం దో[illegible], నేవిలాసమునకై పొమ్మన్నమాత్రానఁ బూ
వులపాన్పుం డిగి, యాతఁడుం గఠినుఁడై, పోయెంగదా! సిగ్గులా
వలకుం ద్రోసి, మదీయచిత్త,మనుకంపాహీను నవ్వానినిం
దలఁచుం గ్రమ్మర; నేమి సేయఁగలదానం? దెల్పుమా నెచ్చెలీ!

తలి, *శయ్యఁ విని కూర్చుదంపతులసంలాపంబులం, బ్రొద్దునం బలుమార్చెప్పఁగ్గలన్నాలఁబల్కుచిలుకఁ, వామాంగి,లాలించి, యా పలుకుల్ మానిచెఁ, బక్వదాడిమఫలవ్యాజమ్మునన్, నోటఁ గ ర్ణలసన్నిర్మలపద్మరాగమణిఖండ మ్మొక్కరుం దుంచి, తాన్.

ఓయి ధూర్తుడ! యటు వోయి మాయావివై
నీ యొనర్చిన యవినీతి పేరి
పరిభవ పరితాప వహ్నులోఁ దుకతుక
నుడుకుచు, సుముఖ యా నొడుపు దక్క
యున్న న న్నెఱుఁగక, యొనరు తప్పినదారిఁ
గౌఁగిటఁ గదియించి, యీగతిఁ బొసఁ
గించితి దుర్దశ నించినసౌభాగ్య
మున; కెది వెన్నంటి పొందఁ గంటి?

కంటె? దయితాఘన స్తన కనకకలశ
రాజ్యతికరాభిమృష్టాంగరాగరంజి
తమ్ము నీయుర మ్మిదె, మలతైలపంక
శబల వేణీపదాంకాభిశంకితమ్ము. ౧౭

అల, దాదవ్వులఁ జూచి లేచుమిషఁ, బీఠైకస్థితిం బాపి; త మ్మలముం దేఁ జనునోజఁ ద్రోసి పరిరంభంబుం; బ్రియాలాపకం బులఁ బాలుం గొన, కంపుచుం బరిజనంబున్ సేవలం, గిన్క న య్యలరుంబోడి, ప్రియోపచారములతో నన్వర్థముం జేసెఁదాన్

కని యేకాసనమందు నున్న యనుఁగుంగ్రాల్గంట్లఁ దా సయ్యనన్,
వెనుకన్ డాసి, ప్రియుండు, మూసె నొకయేణనేత్రవాల్గన్నులన్;
తనమేనం బులకల్ కలల్కొనఁగ, నంతర్హాసలీలోల్లస
ద్ఘనగండస్థలరమ్య యా నపరకాంతన్ వంగి ముద్దుం గొనెన్.

అడుగుల నంటి వేఁడిన, రవంతయుఁ గూరిమి సూపఁ బోక, రా
పడె, యతిగూఢదుష్కపటవర్తనుఁడా! యనుమాత్ర నల్గి, చె
ల్వుఁడు చనినంత, నూరుపులువుచ్చుచుఁ, జేతలిరాకుఁ జన్నులం
దిడుకొని, చూచె నెచ్చెలుల, నింతి, భరింపదుబాష్పదృష్టితోన్.

వరకాంచిం బిగియించి వైచి వసనప్రాంతంబు, నేఁ డేల స
త్వరనిద్రం గొనెనింతి? యంచుఁ, జెలులం బ్రశ్నించునయ్యన్గుకున్,
సరసాపాంగి యొసంగె సెజ్జ నవకాశం, బింత కన్నాయనీ
యరె? యంచుంగనలెత్తి, యొత్తిగిలి, యొయ్యన్ స్వాపదంభంబునన్

పిలువం బాన్పున మాఱుపేరు నిడి, యావేగంబుతో విహ్వలా
కులయై ముద్దియ, యల్కతో నవమతింగూర్పంగఁ, జాటూక్తిదో
హలుఁడౌ చెల్వుఁడు, బుజ్జగించి, విఫలుండై మిన్నకే యుండుడుం,
దిలకించెం జెలి యోరమోము నిడి వానిం, గ్లాని వద్దంచుఁదాన్.

అలరుంబాన్పున నిర్వు రవ్వలిమొగంబై పండి, లో[illegible]ందుచున్,
బలుకుల్ మాని, స్వకీయగౌరవములం బాలించుకొంచుం, దమిన్
వెలి గానీక, శనైరపాంగవలనాప్తిం జూపు లేకమ్ముగా,
నలుకం బాసిరి దంపతుల్, సరసహాసాశ్లేషలౌల్యంబుతోన్. ౨౩

ఏమహానో పరికింతుఁగాక యని, నే నెంతే బిగిం గొంటి; నే మీ మాటాడఁడ యీ శఠుండు? సరి; యం, చేణాక్షి బిట్టల్గె; నాలో, మా యొండొరులీఁపిమాపులచవుల్ పొంగారి రంగార, నే నామై నవ్వితి; నించె నమ్మొలఁత ధైర్య మ్మూఱఁ గన్నీ రొగిన్.

అలుకం ద్రోసి, ముఖేందుఁ బాణితలమం దానమ్రమునిం జేసి, విహ్వాలమైయున్నెడ నొండుమ్రోవఁ గన, కేఁబాదంబులన్ వ్రాల, ఱెప్పలలో నిల్వ కొకింతయుం, గుచతటీభాగంబునన్ దూఁకి, బ్రద్దలయౌ బాష్పముతోఁ దలోదరి, ప్రసాదమ్ముం గడుం దెల్పెఁదాన్

ప్రమదా సాంద్రవిలేపన స్తన ఘన ప్రశ్లేషముద్రాభిల
క్ష్యము వక్షమ్ముఁ బదానతివ్యతికరవ్యాజమ్మునన్ దాఁచుకో
గమకింతే? యన, నేది యేది? తుడువంగా నౌ, నటంచుం, జెలిం
దమిఁ గౌఁగ్గింటఁగదించితిన్; మఱచె నంతన్, దాని నాయింతియున్.

తోరపు నెఱివేణి దువ్వుచుఁ గెంగేలి
కొనగోళ్ళ మెఱుఁగు దూవెనలతోడ;
మొలక లెత్తిన లేఁత తళుకునవ్వులరవల్
పాతరలాడ మేల్వాతెఱపయిఁ;
దిర మిది, ముగ్ధసుందరతరనయనాబ్జ!
వెలయించుచున్నావు వెలయఁ దులయు
నోలయని కొంగ్రొత్తయొలపును బొలుపును,
రవిక లేకయె; యని, మివుల మురియు

చెలువుతలిమమ్ము చెంతన నిలిచియున్న
స్మేరమధురాస్య స్వవయస్యమేలివాలు
గనులసన్నల, సంతోసమున మునింగి,
తొలఁగిచని రెల్ల చెలులు, నవ్వలకు మిషల. ౧౨

చిడిముడిపాటున నడరింపఁబడునుపో
బొమముడి, కనుదమ్మిపువ్వులు విరిసి,
రసము వెల్లువ వాఱె యెసఁగ, నఱ్ఱులు సాఁచి,
వాని వారక చూచుఁ; బూనికిమెయిఁ
దవిలింపఁబడునుబో తాలముల్ నోటికిఁ,
జీటిమాటికి మోవిఁ జిందువొంది
లేనవ్వువెన్నెల లాననమ్మున వెల్లి
విరియు; విఱుగఁబోని సరణి బిగువు

గొనిన నెమ్మనమునఁ, దనువల్లి తొడిగిన
పులకల నెడయాక కులికి యులుకుఁ,
దరుణి! వాఁడు చూపుదారినిఁ బడుపాట
మానసిర్వహణము కానిమాట. ౧౫

ఏలా పదా ర్మాట? లీగోల, యేగోల
యే లవవేశమే నెఱుఁగఁబోదు;
హేల నావలిత తనూలత గా, బొమల్
ముడిచి, వక్రోక్తుల ముంచియుడుట,

కూర్చిన నెచ్చెలుల్ కూర్కొని కూర్కొని
చెవుల కెక్కించు టత్యవసరమ్ము;
తనతప్పిదమ్మును దాచుకొంచుఁ బ్రియుండు,
చాటువాక్కులు వల్కు సమయమందుఁ,

దళుకు నిద్దపు చెక్కుటద్దాలమూల
మూలలనయుండి దుల్లి యుల్లోలతమము
లశ్రువులు వెల్లువలు వాఱి, యక్షియుగము
విడివడ, వెడగువలెఁ బలవించుఁగాని. ౨౯

తెలిసెను నీకథల్; చనుము దిగ్గ నచోటికె; యేటికీ వితా *
పలుకులుఁ? నిన్ననంజనునె? పట్టున మావిధి యిట్టు లయ్యెఁ; నో
చెలుఁవుడ! పేర్చి యీగతికిఁ జేర్పఁగ నీవలపుల్ స్వభావచం
చల మగు మాదుజీవితము చప్పున మాసిన నేమి? తెల్పుమా!

ఉరమునఁ దారహారముల నొప్పఁగఁ దాలిచినావు; నాతి! బం
గరుమొలనూలిగజ్జియలు గల్లున మ్రోఁగెడు; నూత్నరత్ననూ
పురముఖరంబులంఘ్రు;లిట్లు మ్రోఁతలతోఁ బ్రియుఁగూడనేగుచుం,
బరపెద వేటికే దెసలపైఁ జకితేక్షణముల్, వడంకుతోన్? ౩౧

మలయమరుత్ప్రసారములు మాసె; వికాసితమల్లికావరీ
మలభర మైన గ్రీష్మము క్రమంబుగఁ బాసెఁ; గఠోరచిత్తు మా
చెలువునిఁ దోడితేఁగలవె, జీవనదానఘనుండ! యింక? గో
వుల మిరలింప నేర్చుదొర పో యశ మొందు ధనంజయుం డనన్.

ప్రాతఃకాలమునందు వచ్చి యిటు, నిద్రం బాపి తీ; వొందితిం
ప్రీతిన్ లాఘవమేను; గౌరవముదూరంబయ్యె మాంద్యంబుతోఁ;
భీతిన్ నాకయిసేయ వేది! ప్రియుఁడా! వేఁ బొమ్ము; నేఁ జావనన్
భీతిం బాసితిఁ; గొందుఁ బథ్యమిఁక; నీవే విందులే పీనులన్.

ఆ యలినీలలోలాలక బాలిక,
అలఁతిడెందాల మందులము మేము;
ఆ పువువిరిబోడి యబల, ధైర్యం బాఱి
కలఁక వాఱిన కాతరులము మేము;
పూను నా తనుగాత్రి పీనవక్షోజమం
డలమును, విపుల ఖేదులము మేము;
ఘనజఘనస్థలాక్రాంతను మ్లాకాంత,
తొడిఁబడుగతి నశక్తులము మేము;

వింత యెంతయేని, వింతవారలదోస
ములనచేసి, పటిమ వలను బాసి,
కానుపీసమునకుఁ గానివారల మవు
నలవు మేము గొనుట, తలఁచిచూడ. ౩౮

చనినవి ప్రియసఖసఖములు వలయముల్,
తమ మును వచ్చినదారిఁ బట్టె;
కొవిన కన్నీటి గోరంపుదార ల
నారతగతులఁ జెంపారు దారి;

విసినది పని పల్లాయనమంత్రమున ధృతి,
చిత్తగహ్వారము చెచ్చెరన వీడి;
అనినది నిల నింక నరనిముసంబు ని
చో నని యేనాఁడొ మానసంబు;

ప్రియునిపయనమ్ము తప్పని దయినయంత,
నన్నియును వానితోఁ జన నున్నయవ్వి;
పోఁ దలంచితివో, నీవుఁ బొమ్ము జీవి
తమ్మ! ఓర్వ నేర్తువు సుహృత్త్యాగ మెట్లు? ౩౫

క్రొందలిరాకుమోవితళుకుం గొఱుకన్,విడు మంచుఁ, ద్రిప్పుచుం
గ్రొందలిరాకుచేయి,కొని భ్రూకుటి, నిస్సిరు మంచుఁ,గోపముల్
గ్రందుకొనంగఁ జూచుప్రియురాలిని ముద్దిడుకోఁ గలట్టివా
రొందఁగ నేర్చువా రమృత; మూరక ద్రచ్చిరి వేల్పు లంబుధిన్.

అల నిద్రంగొనెఁజెల్మికాఁడు;గొను మీ;వంచుం జెలుల్ వోయి;ర
వ్వలఁ, గీలించితి నాదుమోము వల పొప్పం దన్ముఖాబ్జమ్మునన్;
దలపై పుల్కల నించు తత్కపటనిద్రం గాంచి, నేఁ గాంచితిన్
బలువౌ సిగ్గుఁ; దొలంగె నయ్యదియు నవ్వాఁ డూనుపైధోరణిన్

గురుతుగ నెందుభ్రూకుటియె కోపము,మౌనమె నిగ్రహంబు, నొం
డొరుచిఱునవ్వులే యనునయోక్తులు, దృష్టినిపాతమే ప్రసా
దరసము; నట్టి ప్రేమము వృథా చెడె నేఁడు;ప్రియుండ!కాళ్ళపైఁ
బొరలుచునుంటి వీవు; డిగిపోదు చెనంటికి నాకుఁ గిన్కయున్.

మన మను వొంద మానఁగదె మానిని! మానము; నేలుమూని క
న్గొనలఁ బదద్వయానతు ననున్; మును నీయెడ నెన్నఁ డిట్టి కి
న్క నెఱుఁగనిక్క, మంచుఁ బ్రియకాంతుఁడనన్, మొగమట్టువెట్టియా
తనుతరగాత్రి, కిమ్మనక, తామరకన్నుల రాల్చె నశ్రువుల్.

తలకు మీఱిన మేలి వలపు పెంపులు వాఱ,
నించుకౌఁగిటఁ గదియించునంత
వామనీకృతములై వలుదపాలిండ్లు పొం
గులు వాఱు పులకలఁ గులికి యాడఁ,
దీరని నెయ్యమ్ము తియ్యమ్ము పేరిమి
విగలితాంబరమైన పృథునితంబ
భరసుశోభనశోభ భరపడ, మానద!
చాలుఁ జాలుర యిట్టి ఝాల మనుచు,

సరస మృదుల మనోహరాక్షరముగాఁగఁ
బలుకు నా పువ్వువిరిబోడి, నెలవునందు
నిదురఁ జెందెనో! నాయెద నిలిచిచనెనో?
కలిసిపోయెనో నాలోనఁ? గానరాదు. ౪౦

పయ్యెదకొంగునం గొనిన వల్లభుఁ, డర్మిలి మోము వాంచు; వాఁ
డయ్యెడఁ గౌఁగిటం బొదువ, సంగము లెల్ల మఱుంగు సేసికో
నొయ్యఁ బెనంగులాడుఁ; గను చూరక సస్మితవక్త్రియౌ సఖిం,
దియ్యనిమాట లాడ; దెద నిచ్చ నవస్నుష మ్రగ్గు సిగ్గునన్.

అనునయవాక్యములన్ సడల, కన్గులబోధల మాయఁబోక, పా
యని పవ లెల్లఁ బూనఁబడి, యాఱనికోపము తీఱిపోయె, రే
యిని, నొరుమోములందు నెలయించినచూపులలోని జాలి జా
ల్కొని వెలివాఱ, నాల్మగలకుం, దొలిజాడల విస్మరించితాన్.

ప్రేమసుమమ్ము వృంతమున వీడి పడెం; బ్రణయానుభావసు
శ్రీ మఱుమాయమయ్యె;నిరసించినివృత్తములయ్యె నెయ్యముల్;
మో మఱు వెట్టి కిమ్మనక పోయెఁ బ్రియుం; డిఁక ప్రీలి కూల దే
లా మహిలా! మనమ్ము? చనినట్టి దినమ్ముల నెంచియేనియున్.

చిరవిరహావ్యథం గడచి, చేరి, రతోత్సుకముల్ నిజాంగముల్
వరల నెటో పవల్ గడిపి, బ్రొంతిగ రేయి నవప్రపంచమం
దరిమురిఁ జొచ్చు ప్రేయసుల, కాయతసౌరత కేళి యంతగాఁ
బరగ, దొగిం బరస్పరవివాసకథాకథనంబుపోలికన్. ౮౮

తరళలోచన మాలి తమ్మిపూవులజోలి,
సుమచాపుతూఁపులఁ జూపుగములఁ
దోరపు మేల్పచ్చతోరణమ్ములు గట్టి;
నావల నిడి మొల్ల పూవువిరులు
మల్లెలు మాలతుల్, మధురస్మితమ్ములఁ
బువుల ప్రోవులువోసెఁ బూవుబోడి;
నిండారు బంగారుకుండలఁ దడవక,
పొంగారు మెఱుఁగులపొంక మెసఁగి

చెమరుసూపిన చనుకట్టుచే వెలంది
యనువుపరిచె నర్ఘ్యక్రమ; మనుఁగుఁజెలువుఁ
షేగుదేరుడు నెలవున కింతి గూర్చె,
స్వాంగతతితోడ మంగళస్వాగతమ్ము. ౪౫

తోడరి వ్యక్తాపరాధుండు ధృష్టుఁడు వాఁడు
కడుఁ గట్టువడి నాదునిడినయొట్టు
మేరకుఁ జనెఁగదా; మెలఁత! నేఁడు ప్రదోష
సమయాన నీదువేషమ్ము పూని,
చనుదెంచె; నించి మించినచెల్మిఁ బొరపడి,
కౌఁగిలించుచు, నీవ కాఁ దలంచి,
తగ వివరించితిఁ దత్సంగమోద్యోగ
మునకు సఖులు సాఁచు మనసునుబుకు;

నంత, మునిమ్రుచ్చు వాఁడును, నందరాని
మ్రానిపం డగు నిక్క మవ్వానిపొందు
పోకడ లటంచు, న న్నురమునఁ గదించి,
యిఱికటమ్మున ముంచె; నిం కేమి యందు? ౪౬

పొరిఁ జింతించి నతిం, బటాంతమునఁ గప్పం బాదముల్; నర్మని
ర్భరహాసంబుల నాఁపుకోఁ దివురు; సుస్పష్టంబుగాఁ జూడ; దే
త్తెర,మాటాడుచునుండ నేను,చెలికత్తెం జూచి యేదో యనున్,
వరరమ్యోదయ మింతికోప; మిటులే భాసిల్లుతన్ నిచ్చలున్.

అలరన్, వ్యక్తమహాపరాధకలితుండై, చెల్వుఁ డేతేరఁగాఁ,
జెలియల్ నేర్పిన యెల్ల కాఱుపలుకుల్ చిల్కంబలె బల్కి, యు
వ్వాలఁ బూవిల్తునియిచ్చఁ దప్పక లలిన్ వర్తిల్లఁ బూబోఁడి; మౌ
గ్ధ్య లసత్ప్రేమనిధాన మెంతయు నమోఘుంబున్ మనోజ్ఞంబునున్

దవుదవ్వులన యుండుదారిని నిండారఁ,
గకవిక లయ్యె నుత్కంఠ యంటె;
చేరి రాఁ జేరువఁ జిందఱవందలై,
పెడమొగ మ్మిడియెఁ బేరెడుగడఁ దోఁడి;
పలుక నూల్కొనుపాట నులికి విప్పాలు వాఱె,
నింతలంతల యవు మంతు వెనిచి;
నెఱయింపఁ గౌఁగిలి, మెఱయించెఁ గెంపులు;
చెంగు వట్టిన నల్గి చేర్చె భ్రుకుటి;

అడుగులం బడి దాసుఁడ ననినయంత,
బాష్పపూర్ణేక్షణం బయ్యెఁ; బలుక నేల
వేయి? వేయి రూపులఁ గ్రాలె వెలఁదికన్ను
గలువ, కలితాగసుం డయి కాంతుఁ డడర. ౪౯

ఏలా మైపువ్వుదీవ వాడి వరుగయ్యెం? బాండుగండస్థలం
బేలా బేల! ముఖమ్ము? నం చదుగఁ బ్రాణేశుండు, సాజమ్ము లీ
జాలుల్ వోమ్మని, గ్రీవ యూవలితగాఁ, జార్వంగి, నిట్టూర్చుచున్,
వాలుంగన్నుకొలంకులందొరలుబాష్పమ్మా దెసన్ డుల్చెఁ దాన్.

నలి నోర్జారిన మాఱుపేరునఁ గలంతంబాఱి దైవాహతిన్,
చెలిమ్రోలం దల వంచి, గోరున నిలం జిత్రించి లేఖింప నేఁ
దలకొంటిన్; సఖ వింటె? రేఖ లవియుం, దద్భావినీభావితా
మలరూపం బెలయించి మించు పరిణామంబుం గొనెన్ వింతగా.

అంతం గన్నులు చింతనిప్పులుగ, నయ్యబ్జాక్షి, మిన్నంటె, యా
క్రాంతక్రోధరసాభివేశముమెయిం గంపింపఁ గెమ్మోవి, తా
నెంతే రాపడ నెల్లు, క్రన్ననఁ బ్రయోగించెన్, సుదుర్వార, మ
త్యంతక్షుబ్ధము, వామపాదమును, బ్రహ్మాస్త్రంబునట్టుల్ తలన్.

నెలఁతా! దంభకథావిధాశ్రయము భ్రాంతింద్రోయుమా వేగమా
వలఁ గర్ణేజపవాక్పరంపరలతో బాధింపఁగాఁ బోల దు
గ్మలి! యివ్వానిఁ; దలంతువేని మది నిక్కం బంచు నీచొప్పు, నేఁ
డల నీయిచ్చ కొనర్చి నన్ను గుఱె, ప్రోయాలా! సుఖంబుండుమా.

విని గంభీరము వారిదారవము, నుద్విగ్నుండు పాంథుండు బా
ష్పనిరుద్ధేక్షణుఁడై నిసిన్ ననరె, దుష్టస్వప్రవాసార్తి జా
ల్గనఁగా; జీవితహారి ఘోరవిరహాలాపంబు లట్లుండ, న
ర్థి, నెదం గిన్కకునుం జలాంజలులఁ గూర్చెన్ లోకమప్పట్టునన్.

తవిలినతమకానఁ ద్రావిన రతిఫల
రసపుమత్తునఁ గడు వసము దప్పి,
ఆత్మనఖాంకూర మంటి యంటెనగంటెఁ
బొడఁగని, పొడమినయిడుగడఁ బడి,

అరయ కౌఁగాములు, బిరబిర నుర కెటో
వెడలిపోఁ దొడఁగిన విభులబోఁడిఁ,
ప్రేమసీమణి! యెటు వోయెదు నొడువవా?
యని గ్రహించుడు నేఁ బటాంచలమున,

నొలయుచలము నచ్చలము నగ్గలముగాఁగ,
మోవి నటియింప, నిడి మాఱుమొగము, సాశ్రు
నయననై, విడు విడు మింక న న్నటన్న
మగువమేల్పలుక్కు లేవాఁడు మఱచువాఁడు? ౫౫

అలఘునిఁ, బ్రేమవిహ్వలు, గృహాగతుఁ, బాదనతుం, బ్రియున్ బిగిం
దొలంగక, కాదు పొమ్మనుచుఁ ద్రోసితి విట్లు స్వతంత్రురాలవై;
కలనయినన్ సుఖంబు నిఁకఁ గానక, జీవిత మెల్ల దుఃఖవి
హ్వాలముగ దుష్టరోషఫలితానుభవంబునఁ గుందు; మంగనా!

బాలా!, వల్లభ!—రోసమాగు; మెది గూర్పన్ దాన నేఁజాలితిన్?—
జాలిన్ మాకిటు; నాపరాద్ధుఁడవు, దోసం బంతయున్ నాదె కా!—
యేలా, రాపడి యెల్గువో, వగతు వీ? ; వెవ్వారిదా మ్రోల?—నా
మ్రోలన్; —నీ కవు దాన నేది?; చెలి;—వా పో ల్పొంద కిట్లైతిగా!

ఏలా సమాశ్లేష లీలావిశేషంపు
లాలిత్య మెనయక, బేల నైతి?
ఏలా రసము జాలు లేలఁ, జుంబనవేల
వినమించి వదనంబు, వెట్టి నైతి?

ఏలా పరవశత్వ మోల మోలిమిఁ గొనఁ,
            చెలువమ్ముఁ దిలకింప కలఁతి నైతి?
ఏలా తనివు గ్రాలఁ గ్రోలనై వాగమృ
            తమ్ముఁ, బలుకక దద్దమ్మ నైతి?

ననుచుఁ, గ్రొత్తకోడఱికమ్ముననువు పెనగొ
నంగనై మెలంగిననాఁటిభంగి, యంత
రంగమున నెంచి, తరుణి శుభాంగి, రసము
రూ పెఱుంగునాపయిఁ బరితాప మెనయు. ౫౮

తప్పిదారినయేనిఁ దనరి యన్నామమ్ము
            వర్ణించువర్ణముల్ కర్ణయుగళిఁ
బడినపాటన, తనూవల్లి యుల్లసితమై
            నించు రోమాంచమ్ము నిట్టనిలువు;
నందచందమ్ముల కవు నెల వేవాని
            మోముచందురుగోము లాముకొన్న
తమకానఁ దిలకించునిముసాన నోఁఱమ్ము
            క్రాలు మాఱట చంద్రకాంతమ యయి;

చెలువ! చెలువుఁ డతఁడు, చేర నేతేరి, కం
ఠస్వయంగ్రహానికటపదసుస్థి
తుఁ డవునెడ, నడఁగినయుడుకు, క్రమ్మర, వ్రజ
మయము నామనమున మస్త మెత్తు. ౫౯

ఒనరం జెక్కిలి లక్కచుక్కలును, కేయూరమ్ముముద్రల్ గల
మ్మెన, మేల్కాటుక వక్త్రసీమఁ, గనులన్ మున్నొక్కన్న వీడెమ్ము కెం
పు, నిటుల్, కోపముఁ గూర్చు చెల్వ చెలువమ్ముఁ బ్రొద్దునంగాంచి పూ
నిన లీలాబ్జమునన్ సమాప్తిఁ గొనె నేణీనేత్ర తనిట్టూరుపుల్. ౬౦

మునుకొని మున్నీటి కెన యన నైన పాఱు
కన్నీటిదారల పన్నుగడలు,
వలగొన్న వలపుతీవలఁ బ్రియప్రియములై
ననుచునొట్టుల దిట్టతనపుఁబనులు,
వందలు వేలును బాదప్రణామంబు,
లతిదీన విహ్వాలాభ్యర్థనములు,
ప్రబలమ్ములుగఁ గొంద ఱబలలు బందాలు
వైతురు ప్రియునకుఁ బ్రస్థితునకుఁ;
బేరుఫలముల లెస్స సూ, ప్రియతరుండ!
చనుము వఱువాతనన, నీవు; వినఁగలాఁడ
వాపయిని, మన చెల్మి కీడైన యల్ల
చల్లనికబురు, నిజము, నాచాయనుండి. ౬౧

వలువం గైకొన దింతి, తా భుజలతల్ ద్వారస్థలిం జేర్ప ద
గ్గలమట్టుల్, వడి దొగ్గఁ బో దడుగులం, బ్రస్థాన మీ వాఁగు మం
చలఁతిం బల్కదు; మానివైచెఁ బయన మ్మాతండె, జీమూతస
మ్కాల మా వేలఁ, దద్రసకల్పితసరిత్కల్లోల ముల్లోలమై. ౬౨

కలదుపో కలిసినచెలిమిక త్తెల పైనిఁ
గొండంత నమ్మిక, యుండనిమ్ము;
తలఁ పెఱిఁగిన కూర్చుచెలికాని పై సుంత
చూపు మోపఁగ నీదు చుట్టి సిగ్గు;
ఆవలించినపాటఁ బ్రేవులు లెక్కించు
మాయదారిజగమ్ము, మచ్చరమ్ము
నకుఁ బెట్టినదిపేరు, పకపక నగు నోళ్లఁ
గని, తనమచ్చఁ దాఁ గానలేదు;

హృదయగహ్వరమున గొదకొని యనురాగ
కలన మన్న జ్వాలన మలముకొనియ
జీర్ణ మయ్యె; నేమి చేయనేరుచుదాన
నింక? నెనరునన్ వచింపుమమ్మ! ౬౩

ఓ సకిమిన్నలార! వినుఁ డొక్కటి సెప్పెదఁ; జొప్పడంగ నో,
ప్పాసరసుండు, సమ్ముఖసమాగతుఁ డౌసమయానఁ, దేనియల్
వాసిలి సోనలం గురియఁ బల్కెడువేల, మదంగసంఘు మా
యూసున నేత్రతం గొనునొ, యొప్పునొ కర్ణత,రాదెఱుంగఁగాన్

నీలకచా! నిసర్గరమణీయతకున్ నెల వౌచు, మేలిమిం
దేలెడు నీదు మేనిపువ్వుదీవ, సదానతిమాత్ర మంజుభా
షాలసితంబయై, భయ మొసంగఁగఁజేయుచు నున్న దిట్టు లే
లా? లలితాంగి? క్రుంగుచు ననల్పచిరోపచితవ్యథోద్ధతిన్.

పలుమరు వల్లభుం డిటులు ప్రశ్న మొనర్ప, ననూనమానవి
హ్వాల, వలరాచెయిం బదను వాఱిన యాఱవ ముల్కి కల్కి యా
చిలుకలకొల్కి, యెల్గు గలసీమ నిరుద్ధముగా, ధృతాస్రవాః
కలనల, నాస్తి కించి దసి కారణ మంచు వచింప దా నెఱిన్.

పొసరి వియోగవేళ విషముం డతనుం డెసఁగించె నిమ్మెయిం
దనువునకుం దనుత్వము; దినమ్ములు పెంపఁ దొడంగె నంతకుం
డును దయమాలి; నెయ్యుఁడ! కడుంగడుఁ గొంటివి నీవుఁ గోపమున్;
మనుట యిఁకెట్టులో సుమసమల్ ప్రమదల్ భువి, నిట్టులైన చోన్!

కామిని! మేలె వామత యిఁకం బదముల్ గొని వేఁడు వానిపై?
నే మని యన్నఁ, గిమ్మనక, యెంతయు నీదయఁ గోరుచున్న వాఁ
డా మొగి; నంచుఁ బల్కఁగ వయస్యలు, కోమలకోపవేగ యా
కోమలి కన్నులన్ నిలదు, కూడదు, కన్పడ దశ్రు, వయ్యెడన్.

ఇరవుకొనంగఁ దొల్త మనయిర్వుర మే నొక టే; యనంతరం
బరయఁ, బ్రియుండ వీవు, ప్రియురాలను నే; నటుపైని, భర్త వీ,
వరుదుగ నేను భార్య; ననఘాత్మ్యుఁడ! వజ్రకఠోర ఘోర దు
ర్భర చిరజీవితమ్ము ననుఁ బాయదు, పాపఫలంబుగా నిటుల్.

కాల మ్మెంతయు ముగ్ధ! ముగ్ధత విటా గావింపఁగా నేల? ని
ర్వేలక్రోధముఁ బూనుమా; కొని ధృతిన్, వేవీడుమా యార్జవం;
బీలీలన్ సఖి పల్కఁ, గల్కి యనె— భాషింపంగ దే మెల్లగా;
నాలించుంజుము మన్మనస్థితుఁడు వాఁడంచున్ వెఱంబెంచుచున్

ఈనడిరేయి నేయెడకు నేగెదవే కరభోరు! నీ విటుల్?
ప్రాణగణాధికుండు ప్రియవల్లభుఁ డున్నెడకున్; భయంపడం
గా నయి చిక్కిపోవొకో, నికామసహాయవిహీన? వ్రాని విల్,
దానుగఁ, బంచబాణుఁడు కలండుగదా కఱకై పిఱుందనన్!

నవలీలాకమలాహతుం డితరకాంతాస్పృష్టదష్టాధరుం
డు వరుం డొక్కఁడు, పుప్పొడిం గలఁగినట్టుల్ కన్నులన్ మూసి, ని
ల్చి, వెసం బల్మఱు ముద్దులం గొనియె నోలిన్ భ్రాంతితో డాసి, క
న్నువిరుల్, కుడ్మలితాననాబ్జముగ నెంతోయూఁదు కాంతామణిన్

ప్రిదులునుగాక హృత్పుటము వే; తనువుం దనువుం బొనర్చుఁగా
కదయుఁ డనంగుఁ; డింక నెది యాఁ జపలప్రణయుండు వానితో?
మదవతి! యంచు, రోసమున మానక పల్కుచు, నెంతయుం, బదిం
బదిఁ బరపెన్ దృగంచలము వల్లభుత్రోవన పక్ష్మలాక్షి తాన్.

సుమకోమలీ! గాఢతమసమాశ్లేషవి
శేషక్రమమున విశోషతమెయి
జలజల రాలిన చందనద్రవరజః
పుంజమ్మునన్ విరిపూలపాన్పు
గరగర కర్కశకర్కశమై పోయెఁ
గనుఁగొంటె యిది? యంచుఁ జనవుఁ బెంచి,
నను హఠాత్తుగ నురమ్మున సమారోపిత
నొనరించి, యా మాయపనులయతఁడు,

మోవి స్వచ్ఛందముగ సారె ముద్దుగొనుచు
నల పదాంగుళితో జఘనాంబరంబుఁ
దొలఁచివైచి, రేఁకెత్తిన వలపు గొలుప,
వలయునవ్వాలికతలఁ దా నొలసె నొలపు. ౭౪

నెఱయించి మృదు పదనీరజ ప్రణిపాత
 మందసమారంభ మహితశపథ
ముఖ్య విధివిధానములు వేలు, నెఱి నిరా
 కృతుఁ డయి, ప్రత్యుత్తరతరుణమున
మొనయుడు స్ఖలనమ్ముఁ బ్రణయినీగోత్రాది
 కములఁ బ్రేయస్తురుఁ డమరిచికొను
వ్యాజమొక్కటి యూఁతగాఁ జెవిఁ జేర్పఁ బో,
 కఠిదీర్ఘ విరహా కృశాంగి, యతివ,

యసహాన సఖీ శ్రవణవివరాప్తిరూప
క ప్రమాద పర్యాకులతాప్రమేయ
మై, వివిక్తగృహమ్మున నస్ర మురల,
వేఁడినిట్టూర్పు పుచ్చుచు బిట్టు వనరె. ౭౫

గొదకొని ప్రాణముల్ గుదెగొని వీధిగు
 మ్మముదరి నిలుచుండి, మమత నిండి,
విరిసిన కన్నుఁ దామరపూలు వేలుగాఁ
 గూరుచు ప్రియుఁ డరుదేరు దారిఁ

జూపు లోపినదాఁకఁ జూచియుఁ జూచియుఁ
బవ లెల్లఁ బులఁ గాడు పరువు దొఱఁగి,
తెరువులు మఱువ్వలై తెలిపి సూపని కాఱు
చీఁకటి జగము గ్రసించునంత,

నతిహతాశఁ దూలి, యశ్రువు లిల రాల,
నడు గొకండు లోన నిడి కడంకఁ,
బాంథవనిత యొకతె పరికించె మెడఁ ద్రిప్పి,
యేల రాఁగఁబోల దింత? ననుచు. ౭౬

చిరవిరహాగతుం బ్రియునిఁ జేరఁగఁ దొందర నొందు డెందముం
దొరసి యెటో పవల్ గడపి, తొయ్యలి, వట్టికబుర్లతోడ రా
తిరిఁ గడుఁబుచ్చుచుం జెలులు తేలిచి పోమి, నిదేమొ కుట్టినం
చురువడి లేచి, దీపశిఖ నొయ్యన నార్పెఁ బటాంచలంబునన్.

విసర త్సాంద్రపరాగ లంపట రట ద్భృంగాంగనాసంగతో
ల్లస దుద్యాన రసాలమంజరి సమాలంబంబుగా నిల్చి, మే
నెసఁగం గప్పి తనూత్తరీయకముతో, నీ వేడ్చి డగ్గుత్తికన్,
వసముం దప్పుచు నుందు,పూర్పులకుఁ గంపం బొంద వక్షోజముల్

విని, నేఁ బోయియు వత్తు నన్న పలుకుల్ విస్రబ్ధనై, స్తబ్ధతా
ర్థి నుపేక్షించితి దూర మేగు చటు సారెన్ నిల్చి వెన్గాచు కాం
తుని; నేఁ జిక్కితి శూన్య కేతనమునందుం; బోవు నాప్రాణముల్;
మనియుందుం జిరకాలమిట్లై; భయమాత్మం బాయుఁడీ మీఁరికన్

మదిఁ జింతింప కొకింత ప్రేమపరిణామంబుఌ, సుహృద్వాక్య మే
యదియుం గా దని, కిన్కఁగొంటి, వెది కార్యం బిప్డు? చేజేఁత నీ
వె దలం బోరనఁ బోసికొంటివి లయాభీలానలాంగారముల్
గదవే! నీదునరణ్యరోదనము లింకం జాలుఁ జాలుం జెలీ! ౮౦

మృదితం బయ్యెఁ గపోలపత్రకము నెమ్మిం బాణిరోధమ్మునం;
బొదలెం బీతములై వరాధరరసమ్ముల్ వేఁడినిట్టూర్పులఌ;
గుదురై కుత్తుకలోన నశ్రువు వడంకుం గూర్చెఁ జన్దోయిక్రిఌ;
ముదితా! త్వత్ప్రియతంగొనెంగినుక; కాఁబోమేము నీకామెయిఌ

అలరుంబాన్పుననుండి లేచి యల శూన్యావాసగేహంబునఌ,
ఛలనిద్రారతుఁడైన చెల్వునిముఖాబ్జంబుం బరీక్షించి, న
ర్మిలి ముద్దుంగొని, పుల్కలం దొడుగుడుఌ, వ్రీడాభరానమ్ర యా
చెలినిం జెల్వుఁడు సారె ముద్దుగొనె, నాశ్లేషంబుతో నవ్వుచుఌ

వలరాజుబలువిండ్లువలె నొప్పు కనుబొమల్
తొడరుభంగముమెయి ముడివడంగఁ,
బొదుపుకొ మది విపక్షదిగుపన్యాసడం
బంబు, తాఁ దల యూఁచె నంబుజాక్షి;
కని యది కృతనమస్కారుఁడై వైలక్ష్య
మూని, మానమ్మున నుండెఁ బ్రియుఁడు;
కనలి కెంపులు వాఱు గండమండలమున
మార్గమ్మను బెట్టె మగువమిన్న;

జాలిచూపులజాలుతోఁ జాల వ్రాలె
నడుగువిరితమ్మిపూలపై ననుఁగుఁ జెలువుఁ;
డైనపెద్దలయొద్దనైన విడువ
రాప్రియులు భళా! సమయోచితప్రవృత్తి. ౮౩

మన ముత్కంఠము గాదు; కైకొనవు కంపంబుం జనుల్; పుల్కలం
దను వొప్పారదు; మోము చెమ్మగిల; దాతం డీక్షితుం డైనయం
త, నధీరంబయి, వాని కైవస మగున్ మత్స్వాంత మాయత్తమై;
కన దొంజేదియు;నిర్వహించు టెటు లింకం గోపముం దోపమున్?

పొరయికకైన కాతరత నాతురదృక్ప్ర
రంపరల నవలోకింపఁబడియు,
దోయిలించిన కేలుదోయి యాదలఁ బూని
వీడక వేమాఱు వేఁడఁబడియు,
చివురాకుచేతన చివురాకుదువ్వల్వఁ
గొని జాలి బ్రతిమాలుకొనఁగఁబడియు,
నచ్చంపుప్రణయంపు టమృతంపుజాలెల
యించుకౌఁగిటఁ గదియింపఁబడియుఁ,

దొడరునిర్దయ నది యెల్లఁ ద్రోసివేసి,
పయన ముడుగక కడఁగుడుఁ బ్రాణసఖుఁడు,
దయిత, దయనీయ, తొల్దొల్తఁ దనదుజీవి
తాశ, నవ్వాల వాని, నాయతిఁ ద్యజించె. ౮౫

అల నావచ్చుపథంబునన్ నిలిపి నేత్రాబ్జాతపత్రంబు, లా
విలయగా ప్రేయసిడెంద మన్ పెనమునన్, విశ్లేషరూక్షజ్వర
జ్వలనజ్వాలలఁ దప్తతప్తమున, నాపొందు స్తనస్థానమందు,
లలిన్ రూపఱుచుండు, బాష్పములతో డస్తోడుల్లి, యుచ్ఛ్వాంకృతిన్

తలఁ బాదంబుల మోపి, త్రోవఁబడి, చింతామోహవైక్లబ్యని
శ్చలచిత్తంబున, హాన మూసి, యటు ప్రస్థానంబ సాగించు చె
ల్వ్వ, లతాతన్వి, త్రపాభరాలసలుర ల్లోలాశ్రుపూర్ణేక్షణం
బుల వారించె, వడంక నూర్పులఁ గుచంబుల్, ప్రాణిజీవాశఁ దాన్

మిత్రవిశ్లేషాప్తి మెఱుఁ గాఱి విరిదమ్మి
పువువలె మ్లానమ్ము, మివులఁ బొందు
ర మ్మహార్మ్యఖతుషారకణమ్ము తెఱఁగున,
నస్వస్థతానశనాతికృశము,
సాలసమ్ము విరాళి, నతిమాత్రవిధురమ్ము,
లంబలోలాలకలాలితమ్ము,
మత్త్యాగతాభంగ మంగళావసర సం
జాత కౌతుకకలా స్ఫీతతరము,

రమ్య, మారోపితాటోపరంజితమ్ము,
సురతకేలీకలాపాలసరస, మా సు
మాంగివదనమ్ము, సత్ప్రీత మాదరమునఁ,
దలమె వర్ణింప నలువ కా చిలువకైన? ౮౮.

ఇటుల లిల్లాలికిఁ జెల్లునే? ప్రమద నై తివ్వేల; బాజారునం
బెటులం బెట్టిన వందె లివ్వి; సహజవ్రీడాధనల్ చాస; లం
చిటు దేహస్మృతిఁగన్నమీఁద, మునుకోప్రీ, గ్రన్నసన్వీడెనుత్కట
పుంభావముఁదాల్త, నాపయిఁ బ్రియుంగాంతుఁ, విలోలాక్షి తాఁ

పువువిల్కా—నిదురమ్మెల్పు తుదిపొల్పుం గన్న యావెన్కఁ, సా
రె విలోకించుచు మించుబోఁడి త్రపతోఁ బ్రేయస్తరుం, జాఁచి చే
చివురాకుఁ, గలితాంబరంబు నరసెఁ, క్షేపించెఁ బూఁదండతో
న్క—వడిఁ దీపముపైఁబడం, బతికనుల్ గప్పెఁ స్మయమ్మొప్పఁగాఁ

చను, మింటింటఁ గలారు జవ్వనులు, పెల్చఁ నాతి! ప్రశ్నించి ర;
మ్మనుఁగుంజెల్వాలుకూర్తురోనతు? లితంపంగ్రుఘుల్ తలందాల్చితో
త్తనరాదో? పిశునోపదేశముల నిట్లల్లం గడుఁ మేలె? యెం
దునువిచ్ఛిన్నమయేనిస్నేహము, ప్రియుల్ దుఃఖానువర్త్యుల్ సుమీ

ఉడుగక నిట్టూర్పు లుడుకున దహియించు
నెఱికిఁ బాల్పడినవి నెమ్మొగమ్ము;
మూలమూలల నోలి గాలించి యున్మోలి
త మ్మగుగతి కయ్యోఁజు మ్మోడంద;
కొనఁ జాల దేలీల క్షణకాలమే మీల
నము నించునియతిఁ గన్గలువదోయి;
కఱవుకాటక మయ్యెఁ గలనేనిఁ బ్రియచంద్ర
ముఖదర్శనము తాపపుంజహరము;

కడుపుకూ డయ్యెఁ బవలు రే లడరు నేడ్పు;
వాడె నానాఁట మెయి; పాదపతితు దయితు
న ట్లుపేక్షించి, కాంచితి నవుఫలమ్ము;
నేర్పితిర మాన? మిపు డోడి నింపుకొనిర? ౯౩

ఇఁక నేఁ డాదిగఁ గోపమేని, మఱి యొం డేదేనిఁ, గావింపఁ, బా
తక కర్ణేజప వాక్కులం, బ్రియునిపైఁ; దద్విప్రయోగాప్తిఁ, జం
ద్రకలాగార, స్ఫుటాట్టహాస, నిశయుం, బ్రావృడ్ఘనచ్ఛన్నది
ఙ్నికరం బైన దినం బొకం డయినఁగాని పోవునేమో వృథాం?

ఇది కృష్ణం బనఁ,గృష్ణమే;-సితము నా,నిం కేది కాకున్నఁ?-బో
వుద, మిడ్డే;-యిట నాఁగిపోద,మదియొప్పున్ వేగమే;యంచు, నా
యెదకుం దప్పక మున్ చరించినయతం డీనాఁడు, నా కన్యుఁ డ
య్యె;దరాందోలిత!యైనవా రవుదు రే యెవ్వారికిం బూరుషుల్?

పరమాప్తప్రియబోధలుం, బదయుగాపాతమ్ములున్, నర్మని
ర్భర చేతోహర వాక్చమత్కృతి, పరీరంభక్రమంబుల్, హఠా
త్పరిసంచుంబన, మిట్టిపోడుములఁ గోపం బాఱునుంగాని, నే
నరయన్ వీడఁ దలంపఁ; గర్జ మెది?పాయం డాతఁడుం జిత్తమున్

తనరం బెద్దలమ్రోలఁ గన్నుల నిరుద్ధం బైన కన్నీరు, పె
ల్చన లో నేగి, వియోగసంభవమనోజాతాగ్ని సంసిక్త మ
య్యెను,తన్వంగిముఖంబునుండి వెలియయ్యెంజుమ్ము తద్ధూమ మొ
య్యన నిశ్వాసభరాకులాలిసరణివ్యాజం బుపాత్తంబుగాన్. ౯౭

మొగి భ్రూభంగము నేర్చితిం జిరము; కన్గాఁతల్ భృశాభ్యస్తముల్;
నగ వాఁపంగల నేర్పు శిక్షితము; మౌన మ్మార్జిత మ్మెంతయున్;
బిగువుం బూన స్థిరీకృత మ్మెడఁద; వేవేల్ కోపసంభారముల్
తగురీతిం గడియించితిన్; ఫలిత మా దైవం బెఱుంగుం జెలీ!

రార మ్మొక్క రహస్య మంచు విజనప్రాంతమ్మునం జీరఁ దా,
నారాత్రిన్మనఁ జేరె, మీఱఁ గుతుకం, బాసీన నైతిన్; శ్రవో
ద్వారంబం దెదియో వచించు నెటి కౌవాఁడట్లు, వాఁ డప్డు, ప
ల్మారాముం దాడి, పూనేఁగొ;ప్పధరబింబం బానితిన్ నే నొగిన్

కనుజాడం బడఁబోదు ప్రేయసి; సరిత్కాంతార శైలేంద్ర ప
త్తనరా ట్పక్కణ కోటు లడ్డములు దౌదవ్వైనయవ్వీటి; కి
ట్లని గు ర్తించియుఁ, గన్ను దుడ్చికొని, పాదార్ధావరుద్ధోన్నతా
వనియై, యఱ్ఱులు సాఁచి పాంథుఁడు క నెం బల్మాఱు నాచక్కికిన్.

చక్షుఃప్రీతి పొసంగి; పొంగఁ జనవుల్, స్వాంత మ్మపాయాంతరా
చతౌణమ్ముగ, దూతికాముఖవచస్సారంబు, లాశ్లేషలీ
లాక్షయ్యాద్భుతభోగభాగ్య, మఖిలం బట్లుంచుఁ, డీదో ముదం
బాక్షామాంగిగృహంబుపొంతఁగల రథ్యన్ రాకయుంబోకయున్.

కాంతాలకాంతా! లతాంతావలీకాంత
మల్పేతరము తల్ప మనువుఁ గొల్పఁ,
గాంతుండు, మాఱటకంతుండు కాంతామ
ణీసంతతికి, వాఁడు, నేర్మి మెఱసి,

తఱిసినంతఁ దనంతఁ దాఁ గోకముడి యంత
యును వీడి, యూపాడి మొనయు పసిఁడి
మొలనూలుముడివాలు మొనఁ గీలుకొనిపోలుఁ
గటిలితటమ్మున నిల్చె క్షణముమాత్ర;
మింత యెఱుఁగుదు దృఢముగ నింతి; వాని
యంగసంగమ్ము పొసఁగినయవల నాతె
ఱంగు, వానిహొరంగు, నెసంగురతము
విధ మ దేమియో యెట్టిదో విధికి నెఱుక. ౧౦౧

ఆపెయే భర్మహర్మ్యపరిస్థలముల,
నాపెయే మెట్లపైకోఁపులందు,
నాపెయే నిక్క మాశావకాశమ్ముల,
నాపెయే దాఁపున, నాపె దవుల,
నాపెయే ముంగల, నాపెయే వెనుకన;
నాపెయే సు మ్మిరువైపులందు,
నాపెయే నగళుల, నాపెయే సరణుల,
నాపెయే పవళుల, నాపె నిశల,
నాపెయే యెల్లెడల నయ్యె నరిది దోఁప;
విరహవిధురునకుఁ నాకు, వెలఁది దక్క
నితరలోకమె కనిపింప దెందు, నెపుడుఁ;
బలుకఁ దరమె యి య్యద్భుతాద్వైతసిద్ధి? ౧౦౨

* * *

# పరిశిష్టము

జలదాటోపమలీమసమ్ము నభమున్ సారెన్ సబాష్పాంబకం
బులనీక్షించి, మనోహరుండ! విరహమ్మున్ గూర్తు వేయేని... యం
చలఁతిన్ సానుడినన్ను వల్వఁగొని, యొయ్యన్ రాయుచున్ నేల, వ్రే
ళులతోఁ జేసినచేఁతలందుఁ జెలిపల్కుల్ వొందె వ్యావృత్తతన్.

స్మరరసవాహినీప్రబలసంతతపూరసముద్ధృతుల్ ప్రియుల్,
చిరగురుసేతురోధములఁ, జేరువ నిల్చియుఁ, గాంక్ష దీఱఁ బో,
కరిదిఁ బరస్మరోన్ముఖుల రై, లిఖితప్రతిమాంగపాళి, దృ
క్సరసిజనాలనీతము రసమ్మును గ్రోలుచు నుందు రెంతయున్.

కలపం బంతయు జాఱిపోయెఁ జనులం; గన్దోయి నీతాంజనం;
బల, బింబోష్ఠము మృష్టరాగము; సరోమాంచమ్ము మేఁ;నింతయుం
దెలియంబోవుసుహృద్వ్యథాగమము, దూతీ! పల్కఁ దేలా మృషల్
లలి? స్నానార్థము బావి కేగితి విటుల్; కాదా శఠుం జేరఁగాన్

వసన మ్మూడ్చినఁ, బూర్వమట్లు కలహింపఁ బూన దాయస్తయై;
పాసఁగంగొప్పనఁగొన్న, మోవిగొఱుకం బో, దొప్పభ్రూభంగ; మే
కసరుం జూపక యొప్పగించు స్వయ మంగమ్ముల్ హఠాలింగనా
వసరంబందు; నవీనపద్ధతిఁ గొనెన్ వాల్గంటి నేఁ డల్కలోన్.

కడఁగి యచ్చపు పచ్చకపురంపుతమలంపు
రసమున నొకమొన రంజితమ్ము,
కమ్మని యగురుపంకమ్మునంకమ్ముల
నేమించి యొకెడ మలీమసమ్ము,
తోడరి యొండెడ గందవొడులదుమారమ్ము
వెలిజిమ్మునిమ్ముల విలసితమ్ము,
ఒకమూలఁ గ్రాలు లత్తుకతోడి యడుగుతా
మరపూలగుఱుతుల మానితమ్ము,

వలిత వలి తరంగాభోగ విలసితముల,
నలివినీల లోలాలక లులితకుసుమ
సంతతులఁ జాటుచున్నది, సకియయుత్త
రీయవరము, వలోప్సికలఁ బ్రియ రతమ్ము. ౧౦౭

రమణ సుమోద్భేదరంజితమై, విరి
పానుపుఁ దటుకునఁ బాసి తొలఁగి,
మలచి కూర్చిన మేలిమానికమ్ములగోడ
నఱమోడ్పుమోడ నుత్తమాంగ మూఁది,
మొలకనవ్వులమొవ్వములు వాతెఱ నిసిఱిం
తలు పాఱు మురువున నిలిచియున్న
ప్రియురాలిఁ, బ్రియుఁడు, స్ఫురిత మధరముగఁ, గ
న్నొప్పమలసన్నన మెల్ల ముద్దు గొనె;

దంతమౌక్తిక కాంతిసంతతులు ప్రతిఫ
లించు చెక్కుటద్దాలఁ బాలించువదన
మంశుకాంచలమున మూసి, యలఁతి నూఁగఁ
గుండలస్తబకము, లూఁచెఁ గొమ్మ తలను. ౧౦౮

అల యన్యామణిమేఖలారణిత మాలించి, యాలింగనా
కలనం బొల్చుచు, వేగ విశ్లథభుజాగ్రగ్రంథిఁ బడల్గొంట, నీ
యిల నెచ్చో నిఁకఁ జెప్పుకొందు?నది యింతే నెమ్మదిఁ నమ్మ దీ
చెలి, సర్పిర్మధుయుగ్భవద్బహువచఃక్ష్వేళ భ్రమిఁ భ్రాంతయై.

ఎసఁగి కంటికి మంటి కేకమ్ముగాఁ గాఱు
కన్నీరు చుట్టపక్కాల కనిచె;
నంత యింతయుఁ గాక పంతగించినచింత
నాప్తవృద్ధుల కెల్ల నప్పగించె;
మానఁబోవని యసామాన్యదైన్యంబును
బరిజనంబులఁ బిల్చి పంచిపెట్టె;
రేపు రేపాడి యుద్దీపించు తాపంబుఁ
గూర్చునెచ్చెలులకుఁ గొసరి యొసఁగెఁ;

చోడరి యెడమన్కిఁ బొడమిన దుఃఖ మెల్ల
నిట్టు లందందు భాగించె నింతి; వింటె?
కడు బడలుచున్న దూర్పులఁ బడి, సఖుండ!
నిర్వృతిం జెందఁగల దిఁక నేఁడొ రేపొ. ౧౧౦

తొలుదొల్త నాయురస్స్థలమునఁ దల సూపి
పొడముపోడిమి కయి, పొంగు వాఱి,

బటువులై దిటవులై బలుపువాఱినవి నీ
యమలవక్షఃపీఠి నధివసించి,

యొప్పారునేతత్పయోధరమ్ములు; నిరి
తేనెసోనల మించి తీయనయిన

నీకులుకుపలుకుల నేకీభవించియ
పాసె మౌగ్ధ్యము మదాభాషణములు;

ధాత్రికంఠముఁ ద్రోసి త్వత్కంఠసీమ
నీవు నాసంజితలు నాదుబాహులతలు;
మఱచితే? యీప్రసక్తోళియు నెఱయఁబోదొ
నీదుమార్గమ్ముగా నంత? నిర్దయుండ! ౧౧

ప్రణయక్రోధపరాచియై, కపటనిద్రాముద్రలన్ మూసి లో
చనముల్, పండియయున్న తన్ దఱిసి సెల్వన్,నీవిబంధంబు నూ
ల్కొనుభీతిం జలియింప లేతలిరుప్రేళుల్, మెల్లఁ గైకో విభుం,
డనుసంకోచకలాచితమ్ముఁ గటి నయ్యాలోల కూర్చెన్ బిగిన్.

ఏలా మోము చెమర్చె; నెండఁబడి; - యెంతే రాగి కన్దోయి?,త
ల్లోలాలాపరుషాక్త;-మాలులితముల్ చూర్ణాలకల్?,గాలిఁ;- బో
కా లెన్ బొట్టటు?,సోఁకెఁ బైట;-సొలవుంగైకోంటి?,పిత్రిప్పటన్;-
జాలుంజాలు జవాబు దూతి! ప్రణ మోష్ఠమ్మందు నేమందువో?

ఉడుగ గృహప్రవేశవిధ మొక్కనిరోధముఁ గూర్పఁబోదు; తా
నిడదు పరాఙ్ముఖమ్ము; వెడలింపదు రోషకషాయితాక్షరం;
బడరిన యార్జవమ్మెపస యాజని చెప్పలతోడి చూపులం
దోడి, జననిర్వ్యశేషముగఁదొయ్యలి యొయ్యన నెయ్యునింగనేఁ

అలరం బ్రీతి, ప్రియుండు పూనఁ బటుచౌర్యక్రీడ, వ్రీడాదరా
కులయై వేఁడెడుచేఁడియం గని యనంగుం డేకధానుష్కుఁ, డు
త్కలికన్ సౌరతయుద్ధముల్ ముగిసి, స్కంధావార మప్పట్టునం
దెలియన్ శూన్యముశూన్యమై, మరలిపోయెన్ స్వీయమార్గమ్మునన్

అలుకం, బల్లవకోమలామల, మలక్తాక్తంబు, శింజానమం
జులమంజీరము, మన్మథాలసము, సచ్చోభంబు, నా కాలితోఁ,
బలుమారుం బ్రణయాపరాధవివశస్వాంతచేఁ గాంతచేఁ
దలపైఁ దాడితుమెచ్చుచుండుఁగడుఁగందర్పుండునిచ్చల్ మదిన్.

ఇఁక నాహార మభీష్ట మిమ్ము సకి! కాదే, నీ రహోవృత్త, మె
త్తి కడుం గుత్తుక, యెండవైతు నడివీథిన్ నే, ననం జిల్క; నె
ల్తుక, గూఢస్మితమై, త్రపానమితమై, లోలమ్ము, మో మోరగా
నొకటుల్ వెట్టె, సమీరవక్రిత దలార్థోన్మీలదబ్జంబటుల్. ౧౧౭

తోలఁగింపబడియును దొలఁగింపఁబడకున్న
పాంసువు లందందుఁ బరిఢవిల్లఁ,
గనుఁగొని క్రీడింపఁ గన్నులవిందుగాఁ
గన్నులవులుఁగులమిన్న లెల్లఁ,

జివికి జీర్ణము లైన చీఁకుకొంపలలో వ
నరు దరిద్రకులాంగనాకులముల
నిట్టూర్పుగాడ్పులు నిట్టనిల్వున జర్జ
రితములు వొనరింప గతులు దప్పి,

పుడమిఁ బడుచున్న పీ క్రొత్త మొయిలునుండి,
బిందువులు ప్రావృడవసరానందనములు;
చెలువులం బాసి గాసి కౌ చెలువల మొగ
ము లను చందమామలఁ జల్వి మలినములను. ౧౧౮

హేమించి నేమించు హిమకణమ్ముల నల
జడివాన యను నూహఁ గొలుపువానిఁ,
దుందముల్ నిండ నిందిందిరమ్ములకుఁ గ్రొ
వ్వాలపువిందులు పెట్టు మేలపువానిఁ,
జూడ లెక్కకు రాక సురభిలమ్ములఁ బరా
గముల నువ్వెత్తున గగనమునకు
నెత్తి, యప్పాటన యెల్లవలంకుల
మొగముల వెదఁజల్లుతగవు వెనిచి,

కలిత కుంకుమాంక స్తన కనకకలశ
భర సమాస్ఫాలనోద్గతినిరతి నెఱయఁ,
ద్రావి హరిణలోచనలసీత్కారిముఖము,
మలయుచున్నాఁడు హేమంతమారుతుండు. ౧౧౯

సుందరపానపాత్రమున శుభ్రరుచిం బ్రతిబింబితాత్ముఁ డా
చందురుఁ డోర్మి స్వాదుమధుసారముతోడ నిపీతుఁడై, వడిన్
డెందమునందుఁ జొచ్చి, సడలించె యడంచె ననూనమానినీ
బృందనిరూఢమానపదవిం; గొనె నంత నదే ప్రసన్నతన్.

కులుకుమిటార్లజాఱుముడికొప్పుల నొప్పెడు మల్లెపూలక్రొ
వ్వాలపులజాల్ గుబుల్కొన సువాసితముల్, మలయాగతమ్ము, లా
వలదొర పేరుపోరితముపద్ధతి ఖిన్నతఁ గన్న యన్నుమి
న్నలచెలికాండ్రు, గ్రీష్మపవనమ్ముల నిమ్మగు రాత్రి రాత్రిసూ.

పోకలు వేలు మేలిమొలపుల్ మెలపుం గొలుపం, దలిర్చి యే
డాకులవో ననంట్లపయి నాకలితమ్ములుగా నెకాయకిం,
గోకనదాఘుగంధములుఁ, గ్రొత్తరతమ్ముల మ్లానమౌ వధూ
లోకము చెల్మి మంథరములుం, దగు, మారుతముల్, శరన్నిశిన్.

వరణీయ రమణీయ తరుణీమణీ ముఖేం
దుస్ఫుర త్స్వేదబిందువులఁ దడిసి,
హేలావతీ లోల నీలాలకావళి
సారెసారెఁ గదల్చుసరణి మెఱసి,
బింబాధరీవార పృథునితంబస్థలాం
బరములు చుంబించుపరువు లొరసి,
మదవతీ మదనతీవ్రదశాకలిత కద
నగ్లాని నెడలించునాణె మెనసి,

మాధవప్రియ మాధవ మహితకల్యా
మం దమూల్యమ్మునందు, సమందలీల
వీఁచుచుండు, సమీరము, వికచ విమల
కమల పంక్తి పరాగ పరిమలభరము. ౧_౨౩

కపురంపుపొడితోడి గందపుమేల్పూడి
పూఁతఁ బాండురతర యాతనులత,
వేసినవిడెమ్ము వీడనిపోడిమి
నరుణమ్ము నవపల్లవాధరమ్ము,
తవ్వుజంతరపునీటి తానానఁ గెంపులై
ధౌతాంజనములు కన్దమ్మిపువులు,
ముడిచినపూవులమొగిఁ జెక్కు చెదరక
గంధబంధుర మురుకైశికమ్ము,

పాముకుబుసంబుడంబుసావాసమునకు
నజ్జులం జూఁచు చీనిచీనాంశుకమున
వేష్టితము లంగములు గాఁగ, వెలఁదు లెల్ల
సరసదర్శనల్ వేసవిసంజవేల. ౧_౨౪

పడఁతుక! లెస్స యెంతయుఁ బవల్; నిశి కాదటు;_చాలుఁజాలు లే,
జడమతిదాన వీ వువిద! చాలునటే క్షణదాక్షణార్ధమం
దడరుసగానఁ బోలఁ బగ?_లంగనలార! వినుండు, నున్నయా
నెడఁ బ్రియుతోడికూటమి, యుసీ! యవి రెండు నిఁకేల? కాల్ప నే?

మందమందప్రకారాందోలితోద్ధూత
సమ్ముద్రిత పరాగ సరసతరము,
సూచిసంభేద్యతా సూచితాపరిపత
త్సాంద్రాంధతామిస్ర సంతతమ్ము,
అనిలవేగధ్వస్త తృణకుటీరాగ్రభా
గాపత చ్ఛిద్ర లబ్ధాంతరమ్ము,
గేహకర్మవ్యగ్ర గృహిణీ కుచద్వయీ
స్వేదాపనోదన వాద చణము,

లలిత కందలదల సముల్లాస భాసు
రమ్ము, రసబిందుబృందము, ప్రావృడవస
రాగమమ్మున సమ్మోదయోగభోగ
భావితుల నొనరింపదో భావుకులను? ౧౭

ఏణీశాబవిశాల లోలతర నేత్రేందీవరప్రేక్ష్య, య
క్షీణోరోరుహసంప దూర్జిత కలాశ్రీ లాలనావేల, సు
శ్రోణీభారవినమ్రమ, క్రమవచనాస్తోకప్రకారాఢ్య, నా
ప్రాణమ్ముల్ హరిఁ గొంచునున్నయది శంపాతన్వి, నున్జాపులన్.

తతహా సప్పాలయల్క నుల్కినిసి, నేత్రమ్ముల్ కడుంద్రిప్పి, ప్రో
ద్గతిత్రో నాతలపై హశాన్నిహిత మాకల్యాణిపాదాబ్జ, మా
యతమై పొల్చె, నలక్తకాంకము, స్వధామారక్తమంజీరమున్,
శతపత్రాధిక కాంతికాంతము, మహాసౌభాగ్యచిహ్నంబటుల్.

తవిలి కాందారిమాందారి ప్రోద్ధున నూత
నాంబుదరవమహాడంబరంబు,
నదరుపాటున నిసి నాలించి, కబళించు
వెఱ, వేఱేడితనమ్ము పెరయ, విరుల
తలిమమ్ముపయినుండి తటుకున లేచి ని
ల్చడుపాటఁ గళవళపడుచుఁ బరిజ
నమ్ములు సంభ్రమ మిమ్మెకో లేనెత్తు
జతనమే, యెఱుఁగక జాలు వాఱె

పాఱు కన్నీరు పృథుకుచద్వయము పేరి
కొండలం బడి చిద్రుపలై కుతలి దుల్లఁ,
బాంథునిల్లాలు తలపోసి ప్రాణపతిని,
ముక్తగద్గదస్వరముగఁ బొగిలె మగల. ౧౨౯

అకలంక మ్మమృతంపుబావి చెలిదా నచ్చంపుకెమ్మోవి పీ
డక పల్మాఱును గ్రోలఁ బొల్పడిననాఁటంబట్టియుం, దృష్ణ, చె
ల్లక, వృద్ధిం గొనఁ జొచ్చె; నుజ్జ్వలమహాలావణ్యసారంబు పొం
దిక నచ్చోట నెసంగుచున్నయదిగాదే? యింకనుం జోద్యమే?

* * *

గనఁగాఁ బాంథునకాశ్రయం బొసఁగరీగ్రామంబునం; బాంథ! పూ
ని, నిసిం దొల్త వివాహమంటపమునన్ నిద్రించి, పాంథుండు, నూ
తనజీమూతరవశ్రుతిం గలఁగి, కాంతం జీరి, బిట్టేడ్చెఁ, బె
ల్చన; భీతిల్లుఁ గరంకదండపతనాశంకన్ జనం బాసుతన్. ౧౩౧

కాంతా! కొన్నియ నాళ్ళకుం గడపుమా కన్మూసి; యాదాఁక ది
క్ప్రాంతమ్ముల్ విమలమ్ము, లేను నటులే కాలంబుఁ బుత్తుం; గడున్
సంతోషంబునఁ గూడువార మవలన్; సందేశ మొప్పార, న
త్యంతం బీ విడుమా జలాంజలులు దుఃఖావాప్తి కింకన్ ధృతిన్.

అంబుజనేత్ర! నెమ్మది సుపాత్త్రమయేని నమర్ష, మద్ది నీ.
కుం బరమప్రయోజనమె కూరుచుఁగాక, మఱేమి సేసెదున్?
బింబఫలాధరోష్ఠి! మును నేనె యొసంగిన కూర్మికౌఁగిలిం,
జుంబనముం, బిరాన, వెనుసూడక, క్రమ్మర నిచ్చిపుచ్చుమా.

చినుకుంబూసల పేర్లు, నీరమున సంసిక్తమ్ము వస్త్రమ్ము, జీ
వనజాతమ్ములపత్రముల్, తుహినముక్తాలేయరుక్కాంతి, చం
దనగంధమ్ములునుం, దదింధనము, లెన్నంగా రసస్ఫీతముల్;
కొను నిర్వాణము నెట్లికన్ మనసిజక్రూరచ్ఛటాటోపముల్?

అలరన్ శారదజాహ్నవీధుని, నిజం బాతన్వి; నుస్తైక్యభుల్
పులినంబుల్, భృశలోలలోచనవరంబుల్ సంచలత్ఖంజనం
బులు, తద్బంధనసంతతార్పిత తత భ్రూచాప చాండాలమం
డలపాశంబులు శూన్యకర్ణములు, కందర్పుండు వ్యాధుండునున్.

ఒండొక మిష వెట్టి యుల్లస న్మృదుపదాం
గుళిపల్లవమ్మునఁ గొంక కవని
వ్రాయుపనిన్ వ్యగ్రభావ మచ్చుపడంగ,
శితశబలమ్ము లాశ్రితవిలోల

తా లాలితమ్ములు తారకమ్ములు నలు
వారు లోచనములు సారెసారె
నావహించునను గ్రహమ్ములవహికిఁ గా
విసరుచు నాపయి, ముసురుకొన్న

నాన న్నానమ, మంతర్గ్ర తానురూప
వచన, మీపతన్న్వర దధర భాసురమ్ము,
వదన, మిర వొంద, నను హృదావాసుఁ, బోలఁతి
వలుకరింపమి ప్రీలించు స్వాంత మెల్ల. ౧౩౬

జలజాతాననయూరువుల్ కదలికాచారుప్రకాండంబు, లా
కలకంఠీతిలకమ్మురాజదవలగ్న మ్ముల్లసద్వేది, యి
మ్ములఁ గందర్పనృపాభిషేకమునకుం బూరించి లావణ్యని
ర్మల సారంబుల న్యస్తముల్ కనకకుంభంబుల్ స్తనంబుల్ సుమీ.

అలవునఁ దారహార మది యా హరిణేక్షణనిబ్బరంపుగు
బ్బలపయినిం బ్రసక్తమయి పాయక వ్రేలుచు నున్న; దాణిపూ
సలకును నిట్టిచొప్పు లన, సంతత మారదురంతచాప దా
సుల మగు మాచరిత్రములు శోధన సేయఁగ నేల వేఱుగాఁ?

* * *

కడఁగి యన్యోన్యసంగ్రథితమ్ము లౌ నెట్టి
నివురాకు వ్రేళుల నవరు నూపి,
నెమ్మి నీపన్నమనమ్ము నేలిన మేలి
కేలుదామరదోయిఁ గీలుకొలిపి,

కడకొనునూర్పులఁ గంపితాధరదలా
న్వితముఁ బ్రస్ఫీతనిర్వేదలక్ష
ణాలక్ష్యమాణమ్ము, నామీాల దమల నే
త్రాంబుజాతాంత వాంతాంబుపూర

భరము, భవదీయముఖమును, బడఁతిమిన్న!
కొన్నదైన్య మ్మసామాన్యగుణముగ, నను
దినముఁ దలపోతు వెవనిదో దృఢసుహృత్త్వ
మిట్లు; శ్లాఘ్యుఁడా? నింద్యుఁడా? యెవఁడు వాఁడు? ౧౩౯

చెలి!సద్వృత్తుఁడు,సౌమ్యుఁడున్,గుణగుణస్ఫీతుండు,ప్రేయస్త్వరుం
డలఘుం, డెంతయుఁ గూర్చువాఁ డిటులు ముక్తాహారుఁడై నీపదం
బుల ద్రోలం బడినాఁడు; కైకొనుము పూబోడీ!యురస్సీమఁ; బైఁ
దలి! లే దింకొకదారి, నీహృదయసంతాపంబు శాంతింపఁగాన్.

తనరం గన్గొని బాటసారి యొకఁ డంతస్సారనీలంబు, నూ
తనమున్, మేఘము,నాత్మమందిరముప్రాంతంబందు, డెందంబునన్
మునుకోఁ గొందలపాటు చేద్పడియె, నన్గుంబొల్తి తాఁబేర్చికూ
ర్చిన దుర్దాంతచితానలమ్మొపొగ యన్చింతన్సమాక్రాంతుఁడై

అల లతాంతాస్త్రుచే నాక్రాంతయై విలీ
నత నెనయుచు నున్న విత మెలర్పఁ,
బరు వెఱింగిన హఠాత్పరిరంభసంరంభ
మునఁ జెల్వ పేరురమున మునింగి,

రసముపూరమ్ము శీర్షమ్ముబంటిగ, జగ
మ్మునెఱుక యేవంక మొనయఁబోక,
మునుకొన్న యా మేలిపెనఁకువలం దన
రకము నవ్వానితమకము నెమకి

కొనుకొలందికి మీఱి, నెక్కొను ప్రమోద
సాగరోల్లోలకల్లోల సరణిఁ దేలి
యాడు పూఁబోఁడి రమణి; యవ్వాఁడు రమణుఁ;
డవనిఁ, దక్కువారలు వావి నాలుమగలు. ౧౮౨

బాలా! మౌగ్ధ్యమ? శీలమా? చలమ? చాపల్యంబ? కోపంబ? నో
మా? లోలత్వమ? యిద్ది, యౌవనదశాప్రారంభదర్పంబ? నీ
యాలాపానన సుస్మిత స్తన సితంబాశ్లేష లీలా విశే
షాలన్ హృన్నిహితంబులన్ జగము స్వస్థం; బార్యుఁ డార్తార్తుఁడున్

పెలుచం బొమ్మనియెన్ వలత్తనువు తన్వీరత్న ముద్రూభలతన్;
జెలువుండుంగొనె లోచనద్వయఘుటిన్, శీర్షమ్మునం దానొడుల్;
తెలిపెం గేతన మింతి కన్మొనల; నా ది క్కాతఁ డూహించె; నీ
లలినిన్ నేరిచి రా ప్రియుల్ గురుల మ్రోలన్ గూఢసాంగత్యమున్

ఓ లోలాలక! శూన్యదృష్టి వయినావో నేఁ డిటుల్ వేనిచే?
నేలావణ్యమనోహరాకృతి భవత్ప్రేక్ష్యస్థితిం గ్రాలెనో?
పాలిన్ లోఁ దలపోతు విట్లు లిఖితప్రఖ్యాంగకశ్రేణితోఁ,
గేలం దాలిచి నిండుముద్దు మొగముం గెందమ్మిఁ, గన్నాఁతతోన్

చలన మ్మొందనుగాక చూపు, కొనుఁబో స్ఖాలిత్యమున్ రత్నమే
ఖల, వే ప్రేలునుగాక సంఘులఁ గుచోత్కంపమ్మునన్ రైఁక, నై
చ్చెలి! నే నా శతు గారవింపఁ జనఁజూ, సిద్ధమ్ము; విద్ధమ్ముగా,
నలుకం జిత్తము బీటువాఱె, యసుఁబో, కాలో నిలం జాలుచోన్

తవునర్మోక్తులపేర్మి నానతిఁ బ్రవృత్త మ్మా రతివ్యత్యయం
బవుమీఁదం,బువుబోఁడి,నానఁబడి,యొయ్యం దాల్చె మద్వస్త్ర; మే
నవు దంచుం గయికొంటిఁ దద్వసన; మ ప్తా యింతి, నీవేస మి
ప్పు వహా వ్వా యనె; విస్మరింపఁగలనే పూసంత యాపల్కులన్?

చెలిపీనుంగవఁ బత్ర, మశ్రుకలితాక్షిద్వంద్వమం దాత్తక
జ్జలమున్, రాగము మోవిఁ, బాదముల లాక్షాసారముం, బూర్వమ
ట్లోలయంబోదు; వృథా దలంతు నెద వార్తోచ్ఛిత్తి నైష్ఠుర్య మీ
వ; లిఖింపంగల దింతి లేఖ మెటు సంభారంబుఁ గోల్పోవనై?

కనుచూ పోపదయేని, సుస్థిరరసౌత్కంఠ్య మ్మెటుల్ పన్పడున్?
గా నెనా పూనికి మానముద్ర, స్ఫురణాంకూర మ్మెటుల్ మోవిపై?
మన మానో నియతమ్ము ధ్యానమున, మై మానించు నేప్పుల్లలన్?
బొనరం గోపము నాటితమ్ము, నవలా! పోఁ ద్రోలి, న న్నేలవే.

అయనయమ్ములజాడ లవల కొత్తినదాని,
సిగ్గు లెగ్గులు నోరసిలినదాని,
జాల్గొన్నరసమున సంప్రవృత్తమయైన
దాని, మోమోటము లేనిదాని,

నొందినవివశతఁ గ్రిందుమీఁదుల యైన
దాని, నీహితకల కైనదానిఁ,
గడచినరాతిరి గడఁగి సల్పినదానిఁ,
బూనిక గోప్యమ యైనదాని,

సారె స్మరియించి, యానందసారపూర
మున మునుంగుచుఁ, బెద్దలఁ బోలఁ, బ్రియులు,
రుచిర హాససముద్భేద రోధ మంధ
రామిలత్తారముగ నిల్చి రయ్యెదనున. ౧౫౦

మునుకొని ప్రాచుర్యమునకుఁ గాకుండ గో
త్రవిపర్యయంబు శ్రోత్రములదారిఁ
బడి తప్పిదారిన, కడు గభీరమ్ము హృ
త్కుహరాంతరమ్ముఁ దూఁకొనినయంతఁ,

గృంతనమ్ముగ మర్మవృంతసంతతి కది,
తలిమమ్ముపయి నన్నుఁజెలువుతోడఁ
బవ్వళించియయున్న పల్లవాధరి క్రోధ
నైకవ్యవిధురానుభావ యగుచు,

మాఱ్మాగ మ్రొడఁ గడఁగెఁ; దా మగుడ నుడిగెఁ;
దొంటికవచమ్మ యమ్మోయిఁ దోడిగె వెండి;
కాని, చనుబంతు లెడసేయఁ గలుగ, దేక
భుజలతం గొన్న రమణుఁబొమ్మునసయుండి. ౧౫౧

అలినీలాలక, కన్ను మి న్నెఱుంగుచాయం బోదు; ని ల్వెల్ల వ
త్తిలె, నెత్తిం బడు జవ్వనంపుమద మాతీరౌట; మాస్వాస్థ్యముల్
తొలఁగెన్ దవ్వు; తదంగనాంగములయందుం గద్దు లావణ్య; మ
గ్గలమై మాదునెడందలందుఁ బెనుపొందం జొచ్చె దాహంబొగిన్

వేనకు వేలు చుక్కలును, వెన్నెలఱేఁడును, దీపదీప్తి, వై
శ్వానర తేజముల్, మణులు, వారనిసౌరుల మీఱియున్న, నే
మో, నలుమూలలుం గవియునుగ్రతమమ్ములఁ దోఁచె, నాకురం
గీనయనన్ క్షణం బెడసి, కేవల మొంటిగ నున్కి చొప్పడన్.

ప్రథితానంగమహాహవాంతమున నా వాల్గంటి, వ్రీడాశ్రమ
శ్లథహస్తాబ్జమునన్, రహోగలితవస్త్రమ్ముం గొనం జాల, కా
విధి నంగమ్ము జడాంగసంతతి రసాప్తిం దాఁచుకో నోడి, స్వీ
య ధవాంగంబున లీన యయ్యె, ధృతసర్వాంగీణభావంబునన్.

చెలులారా! వినుఁడా; సుశిక్షితము మీఁచే నల్ల వాగ్జాల మా
లలి వర్షించితి; మౌన మూని, చల మేలం జాలితిం; బ్రేమవి
హ్వాలుఁ డా చెల్వుఁడు, మండలీకృతకుచద్వంద్వంబుగాఁ గౌఁగిటన్
బలిమిం జేరిచి పేర్చి, న, న్నధరబింబం బానెన వ్వాల్కఁగాన్.

పొడముఁ గందనగాయ వడఁకు డిందనిచాయఁ;
దోఁచుఁ బల్కులలోనఁ దొట్రుబాటు;
లావేగలోలత యతిశయిల్లఁగ నుల్ల
మల్లడతల్లడమై కలంగు;

నెనయుఁ దనుత్వంబు తనువల్లి మెలమెల్లఁ;
గనుకొలంకులు నిండి గండి వెట్టి,
కన్నీరు మున్నీరుగా నుర్వరం బాఱుఁ;
బొదలి చింత దురంత, వదన మొందుఁ;

బొసఁగునెద్దాని కిది యెల్లఁ బూర్వరంగ
రచన, యా రోస మవల బిరానఁ ద్రోసి
వేసితిం; జెలి! వంద్య లా వెలఁదిమిన్న
లెంతయుం, బ్రియ మెవ్వారి కిది నిజముగ. ౧౫౬

మాత! మానని రోష మహితామయమ్మునఁ
జాల పీడిత నయి జాలిఁ దూలి,
ప్రేయస్తరుని వాని వేఁ జేరుమేరక
నేరక యీరీతి దూర మైతి;
బలిమిమై నలవు పెం పొలయఁ దదాలయ
సీమ న న్నా మొగి నాముకొన్న
ప్రేమమ్ము నేమించి హేమింపఁ గొంపోవఁ
గల వలంతులు చెలుల్ గానరారు;

చలము మాని, మాని కలఁచులాఘువభీతి,
వాఁడు, తనకుఁ దాన వచ్చు మచ్చు
లుడిగెఁ; గాల మురక గడచుచున్నది, జీవి
తము చలం బటంచుఁ గుములు మనము. ౧౫౭

* * *

చెలువుఁడు, నోరు రాకయె వచించుచుఁ బూనిన స్వప్రయాణవా
ర్త, లలితగాత్రి, గోరపువిరాళి భృశార్దితయై శిరమ్ము వి
హ్వాలత నమించి యొక్కక్షణ, మూపయి,నాతనిఁ గాంచి,వచ్చితీ
వలఘుఁడ!యెప్పుడంచు,సరయమ్ముగఁగౌఁగిటఁగుచ్చిహెచ్చెదా౯

అరయ నెయ్యది వృద్ధగురుజనగౌరవ
భావగమ్యమ యవ్వుత్రోవఁ బోవు;
బొరయుచుందుర యెందు నిరువురుఁ జీటికి
మాటికిఁ జేడ్పాటు మాటమాట;
సహియింపఁబడు నేడ వహియించునయభయ
ధోరణి మందోపచారవార;
మెద్దానికి౯ వైచి యొద్దిక నడ్డగాల్,
మూసి యావలఁ బెట్టు, మొగ్గుసిగ్గు;

లెందు నమ్మలయ్యలపైనిఁ బొందుపడిన
యొట్టుసొట్టులు నమ్మక మొదవఁజేయు;
నదియుఁ బ్రేమమె? పరిచయ మగునుగాక;
యేల యందుఁ గోపాలతాపాలగోల? ౧౫౯

చూపుకోపుల కగ్గమై పరగఁ, బ్రియుండు,
మొనసెఁ, గన్నటు, దరముకులనంబు;
వాఁడు వేడుకపడి పజ్జ కేతేరఁగా,
మోమటుల్, న్యగ్భావ మోముకొనియెఁ;

బరువారుసరసత స్పర్శమ్ము నటియింప,
వెలి కవు తగ వ్రూనెఁ, నలకలట్లు;
మాట మాటన కల్పి మాటాడుపాటన,
నెఱసె శైథిల్యము, నీవివోలెఁ;
బోయె నప్పుడప్పుడ పోయినపోకగాఁ
బులుఁగు మాసి రోస మలరుబోడి
మిన్న, కున్నసిగ్గు తెన్నునఁ, గ్రన్నన,
దయితుఁ డడుగు లంటి దాసుఁడ నన. ౧౬౦

తరలతరంగభంగపరితాడితచాలితమై, నితంబ, మా
పరువున లీల లేల, నల వక్షము విస్తృతమై తలిర్పఁగా,
సరసిని నీఁదులాడు నవసారసలోచన, తా, వయస్యకుం
గర మనురక్త సక్తవలెఁ గన్నులవిందులు గూర్చి పేర్చెడున్.

* * *

స్మరసమరావసానమున సౌరతకేలి విమర్ద ఖేద సం
స్ఫురితతర శ్రమాంబుకణ పుంజ భర చ్ఛురితమ్ము, పాండుర
మ్ము, రుచిర, మర్ధమీలనసముద్రితనేత్రము, సుందరీముఖాం
బురుహము, నెంచియుం, బ్రిదిలిపోవొ, మనఃపుటమా! సహస్రథా?

వయన మ్మిప్పుడ తప్పరానియెడఁ, బోవక్ వచ్చు, నేలాత్వరల్?
దయతో నిల్వుము రెండో మూడో యడుగుల్లన్గొందు నీ మోము నే;
దయితుండా! ఘటికాప్రణాళవిగల ద్వారాభమా సంసృతిక్,
నియతం బీజనిఁ, గద్దొ లేదొ, మరలక్ నీతోడిసాంగత్యమే?

* * *

•

*

అమరుకకవిసంస్కృతకా
వ్యము తెలుఁగునఁ గూర్పఁబడియెఁ, బావన వృషవ
ర్షమునం గార్తికసితపం
చమి స్థిరవాసరమునందు, సరసస్ఫురణన్.

*

•

# నాయికాది వివరణము

* కృతిముఖము
౧వ పద్యము–సర్వమంగళాధ్యానము
౨ శివధ్యానము
౩ ప్రగల్భ, సంభోగశృంగారము
౪ ముగ్ధ
౫ కుపిత
౬ ముగ్ధ, ధృష్టుడు
౭ కుపిత, అనుకూలుడు
౮ వంచిత
౯ అధీర, ప్రగల్భ(తాడనము)
౧౦ ప్రవత్స్యత్పతిక
౧౧ అనుకూల
౧౨ ప్రవత్స్యత్పతిక
౧౩ ప్రవాసి
౧౪ కుపిత
౧౫ కలహాంతరిత
౧౬ అనుకూల, చతుర, స్వాధీనపతిక
౧౭ అనుకూల, ఋతుస్నాత, ధృష్టుడు
౧౮ ప్రగల్భ
౧౯ అనుకూల, దక్షిణుడు, ధూర్తుడు
౨౦ కలహాంతరిత
౨౧ అనుకూలురు
౨౨ మృదుకోప, ముగ్ధ, శఠుడు
౨౩ ప్రణయక్రోధము, అనుకూలురు
౨౪ ముగ్ధ
౨౫ కుపిత, అనుకూల, ధీరలలితుడు
౨౬ ధృష్టుడు
౨౭ మధ్యమ
౨౮ అనుకూల, స్వాధీనపతిక
౨౯ ముగ్ధ, అనుకూల
౩౦ శఠుడు
౩౧ ముగ్ధాభిసారిక
౩౨ ప్రోషితపతిక
౩౩ శఠుడు
౩౪ ముగ్ధ
౩౫ ప్రవత్స్యత్పతిక
౩౬ కిలకించితము
౩౭ మధ్యమ
౩౮ ధీరాధీర, ప్రగల్భ, మధ్య
౩౯ కుపిత
౪౦ ప్రవాసి
౪౧ నవస్నువ, ముగ్ధ
౪౨ కుపితులు, అనుకూలురు
౪౩ కలహాంతరిత
౪౪ చిరవిరహాసంగతులు
౪౫ వాసకసజ్జిక
౪౬ ధృష్టుడు
౪౭ కుపిత, అనుకూల
౪౮ ముగ్ధ
౪౯ కుపిత
౫౦ వంచిత, ముగ్ధ, అన్యాసక్తుడు
౫౧, ౫౨ కుపిత, (తాడనము)
౫౩ కుపిత, ముగ్ధ, అనుకూలుడు, ధీరలలితుడు

౫౪ ప్రవాసి
౫౫ మత్త, ప్రవాసి
౫౬ కుపిత
౫౭ ధీరాధీర, మధ్య, ధీరలలితుడు
౫౮ ప్రౌఢ, స్వాధీనపతిక
౫౯ కలహాంతరిత
౬౦ ఖండిత, ధృష్టుడు
౬౧ ప్రోషితపతిక
౬౨ అనుకూల, స్వీయ, భవిష్యత్పథికుడు
౬౩ ముగ్ధ
౬౪ భావప్రగల్భ
౬౫, ౬౬ ప్రౌఢ
౬౭ కలహాంతరిత
౬౮ కుపిత, ధీర
౬౯ ప్రగల్భ, అనుకూల, అన్యాసక్తుడు
౭౦ ముగ్ధ, మధ్యమ
౭౧ నవాభిసారిక
౭౨ ధృష్టుడు, మధ్యమ, ప్రౌఢ
౭౩ కలహాంతరిత
౭౪ ప్రౌఢ
౭౫ ధృష్టుడు, ప్రౌఢ
౭౬ ప్రోషితభర్తృక
౭౭ ప్రౌఢ
౭౮ ప్రవాసి
౭౯ ప్రోషితభర్తృక
౮౦ కలహాంతరిత
౮౧ కలహాంతరిత
౮౨ ముగ్ధ, స్వాధీనపతిక
౮౩ కుపిత
౮౪ ప్రగల్భ
౮౫ ప్రవత్స్యత్పతిక
౮౬ ప్రవాసి
౮౭ ప్రవత్స్యత్పతిక
౮౮ ముగ్ధ
౮౯ ప్రౌఢ
౯౦ ప్రౌఢ
౯౧ కుపిత
౯౨ ముగ్ధ, కలహాంతరిత
౯౩ కలహాంతరిత
౯౪ కలహాంతరిత
౯౫ కలహాంతరిత
౯౬ ప్రోషిత
౯౭ స్వాధీనపతిక, ప్రియపరాయణ
౯౮ స్వైరిణి, మధ్య, ప్రగల్భ
౯౯ ప్రవాసి
౧౦౦ అనురక్తుడు
౧౦౧ ప్రగల్భ, స్వాధీనపతిక
౧౦౨ ప్రవాసి
౧౦౩ ముగ్ధ, స్వీయ, అనుకూలుడు
౧౦౪ అనురక్త, అనురక్తుడు
౧౦౫ స్వీయ, ప్రగల్భ, శఠుడు
౧౦౬ స్వీయ, ధీర, ప్రగల్భ, శఠుడు
౧౦౭ ప్రౌఢుడు, ప్రౌఢ
౧౦౮ స్వీయ, మధ్య, ప్రగల్భ, స్వాధీనపతిక
౧౦౯ స్వీయ, ప్రగల్భ, శఠుడు
౧౧౦ పరకీయ, కన్య

౧౧౧ సాధారణ
౧౧౨ స్వీయ, మధ్య, స్వాధీనపతిక, అనుకూలుడు
౧౧౩ స్వీయ, ప్రగల్భ, శఠుడు
౧౧౪ స్వీయ, ధీర, ప్రగల్భ, శఠుడు
౧౧౫ స్వీయ, మధ్యమ, స్వాధీనపతిక
౧౧౬ కుపిత (తాడనము)
౧౧౭ స్వాధీనపతిక, ప్రౌఢ
౧౧౮ వర్షాగమము
౧౧౯ హేమంతము
౧౨౦ మధుపానము, చాటూక్తి
౧౨౧ గ్రీష్మము
౧౨౨ శరత్సమీరము
౧౨౩ వసంతప్రభాతము
౧౨౪ వేసవిసాయంసంధ్య
౧౨౫ ప్రోషిత
౧౨౬ వర్షాగమము
౧౨౭ అనురక్తుడు
౧౨౮ కుపిత
౧౨౯ ప్రోషితపతిక
౧౩౦ పరకీయ, రక్తుడు
౧౩౧ ప్రవాసి (కరంకదండము=మరణ సుంకము)
౧౩౨ వర్షాకాలపు ప్రవాసి
౧౩౩ కుపిత, శఠుడు
౧౩౪ విరహిణి, విరహి
౧౩౫ అనురక్తుడు, పరకీయ
౧౩౬ ముగ్ధ, స్వీయ, అనురక్తుడు
౧౩౭ అనురక్తుడు
౧౩౮ అనురక్తుడు, పరకీయ
౧౩౯ ముగ్ధ
౧౪౦ ప్రగల్భ, కలహాంతరిత
౧౪౧ ప్రవాసి
౧౪౨ ప్రగల్భ, స్వాధీనపతిక
౧౪౩ ముగ్ధ
౧౪౪ జారుడు, జారిణి
౧౪౫ పరకీయ, రక్తుడు
౧౪౬ కుపిత, ప్రౌఢ, అనురక్త, శఠుడు
౧౪౭ స్వాధీనపతిక, అనుకూలుడు
౧౪౮ విరహిణి, పరకీయ
౧౪౯ కుపిత, అనురక్తుడు
౧౫౦ మధ్యమ, స్వాధీనపతిక, అనుకూలుడు
౧౫౧ కుపిత, అనురక్త, ధీరలలితుడు
౧౫౨ జారుడు, పరకీయ
౧౫౩ విరహి, ప్రౌఢుడు
౧౫౪ ప్రౌఢ, స్వీయ
౧౫౫ ప్రగల్భ
౧౫౬ కలహాంతరిత
౧౫౭ కలహాంతరిత
౧౫౮ ప్రవత్స్యత్పతిక
౧౫౯ ప్రణయనిర్వచనము
౧౬౦ స్వీయ, మధ్యమ
౧౬౧ పరకీయ, జారుడు
౧౬౨ ప్రవాసి
౧౬౩ ప్రవత్స్యత్పతిక

* కృతి సమాప్తి